# సూతపురాణము.



## ద్వితీయాశ్వాసము.

వెల రు 1—0—0.

కృతికర్త:

త్రిపురనేని రామస్వామిచౌదరి,

శతావధాని, బారిష్టరు,

మునిసిపల్ చైర్మన్.

తెనాలి.

కం. బూతు పురాణముగాదిది
ప్రాతపురాణమునుగాదు, పాతకహరమౌ
సూతపురాణంబియ్యది
పూతపురాణంబు పుణ్య, పురుషావళికిన్.

## ఫలశ్రుతి.

శా. సూతప్రోక్త పురాణసంహితను సం। శుద్ధాంత రంగంబుతోఁ
బ్రాతస్స్నాయములం బఠించు నెడలన్ । బ్రహ్మాయురారోగ్యముల్
భూతప్రీతియుఁ జిత్తశుద్ధియుఁ దమో । లుంటాక వైరాగ్యమున్
నీతిప్రోత వివేచనంబుగలుగున్ । నిత్యంబు సత్యంబుగన్.

# నె న రు.

గీ. వేఁగుఁబోకనే పద్మముల్ । విచ్చుచుండుఁ
గమ్మనెత్తావి విరఁజిమ్ము । కాంతితోడ
నడుగఁబడకుండఁ బాంధుల । యలపుఁబావ
నెట్టివాఁడైన నీమర్మ । మెఱుఁగఁగలఁడె ?

# సూచిక.



## దిద్దుబాటు

| పద్యము | | |
|---|---|---|
| 18 | త్రిదివత్తు | త్రిదివమ్ము |
| 12 | మయ్యమాని | మయ్యాని |
| 39 | గంగాశ్రోతో | గంగాస్రోతో |
| 154 | వెల్లజక్కని | వెల్లజక్కని |
| 160 | మగవాండ్రన్నఁ | మగనాండ్రన్నఁ |
| 193 | దోలుట | దోఁటలు |
| 321 | గ్రైవశంబు | గ్రైవసంబు |

# సూతపురాణము.



## ద్వితీయాశ్వాసము.

జోతలు.

చం. మలమలమాడు పొట్ట, తెగ ♦ మాసినబట్ట, కలంతపెట్టఁగా
విలవిలయేడ్చుచున్న నిఱు ♦ పేదకు జాలినిఁ జూపకుండ, ను
త్తలపడిపోయి జీవరహి ♦ తంబగు బొమ్మకు నిండ్లువాకిళుల్
పొలమును బొట్రనిచ్చెడి ప్ర ♦ బుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్. 1

ఉ. చేసిన దోసమీశ్వరుని ♦ చింతనచే నశియించునన్న వి
శ్వాసము కల్గి రేఁబవలు, ♦ పాపమొనర్చుచుఁ దీరినప్పుడే
దోసమయంబునం గలముఁ ♦ దొందరగాఁగొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటిపద • పంకజముల్ శరణంబు వేడెదన్. 2

ఉ. కామపరీతబుద్ధి గుణ ♦ కర్మపరీక్షను మాని బ్రాహ్మణ
స్వాములఁ జేసి కొందఱిని ♦ బానిసలం బొనరించి కొందఱిన్
బూమెలుచెప్పి యీభరత ♦ భూమిఁగలంచెడి వర్తమానహిం
దూమత సంప్రదాయమును ♦ దోసిలియొగ్గి భజింతునిచ్చలున్. 3

ఉ. పొచ్చెములేని మిండతల ♦ పొత్తయినన్ బహుపాపమంచు వా
క్రుచ్చుచు నాలిముచ్చులయి ♦ కొక్కిరి వేలుపు నాగవాస మం
దిచ్చెడి కమ్మతావిగల ♦ యెంగిలిబాగల మీఁదిపేర్మిచేఁ
గ్రచ్చుఱ యజ్ఞముల్ సలుపు ♦ బ్రాహ్మణదీక్షితులన్ స్మరించెదన్. 4

చ. మఱచితిఁ దొల్లి పూర్వకవి ♦ మాన్యులనెంచుచు మత్కృతీనుఁడౌ
బిరుదుమగండు సాయనము ♦ వేంకటనాథకవీంద్రచంద్రు సం
స్మరణ మొనర్పనైతిని బ్ర ♦ మాద వశంబునఁగాన నిప్పుడా
కొఱతనుదీర్చికొంటి, నిది ♦ గో! కుసుమాంజలియెత్తి వానికిన్. 5

గీ. మాతృభాషవలని ♦ మమకారమునఁజేసి
తెలుఁగు బాసఁజదివి ♦ "దేశికవిత"
నుడులకూర్పు నేర్పు ♦ నోరూరునట్టుగాఁ
బలుకనేర్చువారె ♦ తెలుఁగు కవులు. 6

క థా ప్రా రం భ ము.

కం. ప్రథమాశ్వాసంబును నే
గ్రథియించితి సూతమాని ♦ కరుణారసదృ
క్పథగాముఁడనై యావలి
కథావిధానంబుఁ బాఠ ♦ కా! విను, వినుతున్. 7

సీ. అరుణోదయాత్పూర్వ ♦ మంబరంబున భార
తపతత్రివేఁగు గీ ♦ తములుపాడ
కలకలారావ సం ♦ కలన సంకులముగా
గ్రుడ్డుపుట్టువులెల్ల ♦ గూండ్లువీడ
సౌగంధికాబ్జాత ♦ జాతసౌరభసిక్త
మందానిలంబట్టె ♦ మలసియాడ
పుండరీకశరారు ♦ తండంబు హాయిగా
గుఱ్ఱుపెట్టఁగఁ గొండ ♦ గుహలనీడ
గీ. వేఁగుజాముననే లేచి ♦ జాగులేక
జాహ్నవీతోయములయందు ♦ స్నానమాడి

జపముఁ గావించి సూతర్షి ♦ సాధుమూర్తి
మరలి నాతోడఁ దనయాశ్ర ♦ మంబుఁ జేరి. 8

ఉ. చీకటిగాన్న చెట్టుకడఁ ♦ జింపిరియాకుల చాపమీఁదఁ బుం
స్కోకిల కాకలీధ్వనులు ♦ శ్రోత్రపుటంబుల విందుఁగూర్పఁగా
వ్యాకులపాటులేని హృద ♦ యమ్మున నమ్ముని కూరుచుండి నా
కైకనుదోయి త్రిప్ప సరి ♦ గా నుపవిష్టుఁడ నైనవెంటనే. 9

గీ. శేషధర్మ్ములను వచిం ♦ చెదనటంచుఁ
జెప్పితిని నిన్న పుత్రకా! ♦ చెప్పవోయి
నీ యెఱుంగవలసినట్టి ♦ నిఖిలమైన
ధర్మ సూక్ష్మముల్ పెద్దలఁ ♦ దలఁచి యనిన. 10

కం. పిమ్మట గురుగురుభక్తిని
నమ్ముని మూర్ధన్యనాన ♦ నొఁదలనిడుచున్
బన్నెరపాటును విడచి క్ర
మమ్మునఁ బల్కితినివత్స్య ♦ మాణ విధమునన్. 11

ఉ. కంఠముఁ జించికొంచు సరి ♦ గా వినుచో నఱచేతిలోన వై
కుంఠముఁ జూపఁగాఁగలవు ♦ కొన్ని పురాణములంచుఁ జాల ను
త్కంఠతఁ గొందఱాడెదరు ♦ తథ్యము నాకెఱిఁగింపుమయ్య మాని
నుత్కంతచరిత్ర! మీకు బుధ ♦ కోటి గరాగరి చెప్పినట్లుగన్. 12

గీ. సర్వసంగపరిత్యాగ ♦ సాధుమూర్తు
లైన మీకు మోమోటమి ♦ యనుటలేదు
కాన దూరుపాగడ్తలన్ ♦ గణుతిసేయ
కున్నదున్నట్టుగాఁ జెప్పఁ ♦ డో యతీంద్ర! 13

సీ. దేవతాలోక మే ♦ దిక్కున వెలుగొందు ?
కాలమానంబెట్టు ♦ గడలునందు ?
దేవతలెవ్వారు ? ♦ దేవేంద్రుఁడెట్టిఁడు?
తన్మూర్తి యేరీతిఁ ♦ దనరుచుండు ?
దేవేంద్రుఁ డెందుచేఁ ♦ ద్రిభువన సామ్రాజ్య
పట్టభద్రుఁడనెడి ♦ ప్రఖ్యాతిఁగాంచె ?
దేవలోకమునందు ♦ దేవతాళికినెట్టి
శీలవృత్తంబులు ♦ చెలఁగుచుండు ?
గీ. అమరపరిపంథు లేభాతి ♦ నసురులైరి ?
పుణ్యజనులైరి రాక్షస ♦ మూర్తులైరి ?
దేవయోనులకును భార ♦ తీయులకును
బాంగెమేమైన యున్నదే? ♦ సంగరహిత ! 14

వ. అనిన యంత పౌరాణికప్రకాండుఁడు, ప్రహృష్టాంతరంగుండై మున్నొక యప్పుడు స్వానుభవంబున నెఱింగిన సమాచారంబు సాంగంబుగా విన్పింతు వినుమని యిట్లు చెప్పఁదొడంగె. 15

—: సూతమహర్షి స్వర్గలోకప్రయాణము :—

సీ. దారుకావని నున్న ♦ తాపసశ్రేష్ఠులఁ
బొడఁగాంచ నొకనాఁడు ♦ బుద్ధిపుట్ట
యోగబలంబుచే ♦ నుప్పొంగి నింగికిఁ
గనుఱెప్ప పాటులోఁ ♦ జనఁగనచట
బ్రహ్మర్షి సంఘంబు ♦ బహుళసంఖ్యాకమై
వాదోపవాదముల్ ♦ ప్రస్తరించి
సర్వశాస్త్రంబులఁ ♦ జర్చించుచుండెను
నిరుపమానాతి పాం ♦ డిత్యగరిమ

గీ. సభికులెల్ల రానంద ర ♦ సప్రవిష్టు
లగుచు నాలించుచుండిరే ♦ కాగ్రవృత్తి
నంత బ్రహ్మవాదులఁజేరి ♦ యభినుతించి
తత్సభాస్థలిఁ గూర్చున్న ♦ తత్క్షణమున. 16

గీ. దేవతలను గూర్చి ♦ దేవలోకముఁగూర్చి
చర్చ తీవ్రముగను ♦ సాఁగఁజొచ్చె
సంయమీంద్రులెల్ల ♦ సంశయగ్రస్తులై
యూరకున్న మీఁద ♦ దారిలేక. 17

కం. వివదించిరి సంయములు ప
లువురొగి త్రిదివత్తు దేవ ♦ లోకంబనుచున్
బ్రవచించిరి "తిబితే" మరి
త్రివిష్టపం బగునటంచు ♦ దేవమునీంద్రుల్. 18

కం. హిమవత్ భూధ్రముకైలా
సమహీధ్రము నుత్తరించి ♦ చనఁగఁ "డిబెట్" ని
క్కమ కన్పట్టుననుచు సం
యమివర్యులు కొంతమంది ♦ యనిరటుమీఁదన్. 19

కం. కొందఱు మరుభూమికవలఁ
జెందినదేశంబని తెగఁ ♦ జెప్పిరి తుదకున్
సందడిబుట్టెను సభలోఁ
గ్రందుగ నలుమూలల నవుఁ ♦ గాదను నుడులన్. 20

గీ. వారివారించి మెలపుతో ♦ వాలఖిల్య
సంయమీంద్రులు నావంకఁ ♦ జక్కఁజూచి
"కాయసిద్ధియు దివ్యసం ♦ కల్పసిద్ధి
కలుగువాఁడవు నీవేగి ♦ తెలిసిరమ్ము." 21

మ. హిమవంతంబును దాఁటి మానవుల కెం♦తే వాసయోగ్యంబు కా
ని మహీభాగముఁజూచి మంచుపడు ఠా ♦ నేలన్ విలోకించి వే
గమ యచ్చోవసియించు పంచజనులన్ ♦ గన్నార వీక్షించి సం
యమి లోకంబున కెల్లఁదెల్పుమనిసం♦భావించి వాకు వ్వఁగన్. 22

కం. విని వెంటనె వింటికెగసి
ఘనాఘనసమూహమధ్య ♦ గతుఁడనగుచుఁ బో
తిని మానీశ్వరు లావా
యని దిక్కులుచూడ నుత్త ♦ రాభిముఖుఁడనై. 23

గీ. నదులు నల్లని త్రాచుల ♦ నంగఁదోఁచె
మలలు పిల్లల బొమరిండ్ల ♦ మాడ్కిఁదోఁచె
గగనవీథిని వాయువే ♦ గంబుతోడఁ
బఱచుచుండిన నాకు వి ♦ భ్రమము గదుర. 24

సీ. పచ్చనిహొంబట్టు ♦ పఱపునై చినరీతిఁ
బసరుఁగ్రక్కెడి లతా ♦ ప్రతతియుండ
వెలిమబ్బుఁ దెగఁజించి ♦ తెలినీరు గొనితెచ్చు
సన్నని శృంగ రా ♦ జమ్ములుండ
ఏకోనఁ గనరాని ♦ మొనలేని మందు మా
కులు వేరువెల్లంకు ♦ లలమియుండ
పిల్లికూనలనై నఁ ♦ బెంపఁజాలిన నీరు
గొనికొండ వాగులు ♦ చనుచునుండ

గీ. వెండిపూతఁ బూసినభాతి ♦ వెలుగుచుండఁ
గొఱలి కనులకు మిఱుమిట్లు ♦ గొలుపుచుండఁ
దోఁచు శృంగముల్ కంటిఁ గం ♦ దోయినిండ
మన్చు వారికిఁ బెనుదండ ♦ మంచుకొండ. 25

గీ. చదలుదాఁకు మ్రానిమొదలు ♦ కుదులు పొదల
మెదలు తుమ్మెదల రొదలు ♦ కదలు నదులు
విదులు క్రొందావి విరిగుత్తి ♦ పదులు పొదలు
మొదలు తుద లేని ముదిగొండ ♦ మొదలుగంటి. 26

శా. గోలాంగూలలులాయ సూకరతర ♦ క్షువ్యాళ శుండాల శా
ర్దూలన్యంకు హరీంద్రసాలముఖ జం ♦ తుప్రాప్త హింతాలత
క్రోలవ్యాఘ్ర తమాలతాళ వివిధ ♦ క్షోణీజసంతాన మా
భీలంబై కనుపట్టెఁదుంగ హిమవ ♦ ద్భూమాటవీఘాటముల్. 27

వ. అంత ననంతసాహసంబున, నెడతెగని మంచుబొట్టు దుమారంబు
కన్గప్పుచున్నను, జుఱుకు చుఱుకునఁ దేలుగుట్టిన చందాన వడిగం
డ్లొడలికి నొప్పి గలిగించుచున్నను సరకుసేయక. 28

కం. తారాపథ గాముఁడనై
యారూఢ గతింజనంగ ♦ నటపైపైనీ
హారావనీధ్రశృంగము
దారికి నడ్డంబయగుచుఁ ♦ దానరికట్టెన్. 29

కం. మిక్కిలి యక్కజపాటున
దిక్కులు పరికించుచుండ ♦ దివ్యచ్ఛోభా
ధిక్కృత పుందరయగు గిరి
యాకృతి కన్పట్టెముందు ♦ నుచ్ఛంబగుచున్. 30

కం నాలోనాలోచింపఁగఁ
గైలాసము మాటునాకు ♦ జ్ఞప్తికిరాఁగా
శైళమ నేలకు డిగ్గుచు
నాలోఁ దచ్ఛైలవిభవ ♦ మరయుచునటుపై. 31

ఉ. చూచితిఁగందళీపిహిత ♦ సుందర కందర మందిరావళుల్
చూచితి మాతులుంగతతి ♦ లుంగలవంగలతాకుడుంగముల్
చూచితి నంబరావరణ ♦ చుంబిధరాధర తుంగశృంగముల్
చూచితి సిద్ధమౌనిజన ♦ శుద్ధసమిద్ధకుటీరపద్ధతుల్. 32

గీ. మబ్బులందు మున్గి ♦ మఱుమాయ మగుటచే
సూర్యరశ్మియేమి ♦ సోకకున్కఁ
గప్పుచున్న మంచు ♦ కఱగమి నాకొండ
వెండికొండఁబోలె ♦ వెల్గుచుండె. 33

కం. ప్రాలేయ ప్రావృత త
చ్ఛైలము రజతాద్రిఁబోలె ♦ జానుగనుండెన్
శూలినివాసం బగుచుం
గ్రాలెన్ రజతాద్రియనఁ బు ♦ రాణములందున్ 34

గీ. కొండబొరియనుండి ♦ కొలఁదిగాఁ గొలఁదిగాఁ
గఱిగి పడెడిమంచు ♦ కరుడుగట్టి
వెల్లరాడుగాఁగ ♦ వెలసినమాత్రాన
స్ఫటిక లింగమూర్తి ♦ యటులఁదోఁప. 35

గీ. కొండకోనలందుఁ ♦ గుర్మ్మురు చుండెడి
భిల్లజాతియింటి ♦ వేలుపగుచు
శైవలింగమూర్తి ♦ "శాంబరీ భిల్లుఁడై"
రాణకెక్కె నీ పు ♦ రాణములను. 36

కం. కనుచూపు మేరబోఁగాఁ
గనుఁగొంటిని నాముపెద్దు ♦ కంటివలెను దె
ల్లని దోవతివలెనుండిన
వినువాకను బాలువోక ♦ విస్మితితోడన్. 37

కం. పరిశుద్ధతోయమయమై
పఱపగు నమ్మంచుకొండ ♦ ప్రస్థముమీఁదన్
దొరలితొరలి మందాకిని
పరిపాటిన్ వచ్చివచ్చి ♦ బయలంబడఁగా. 38

కం. ముంగలఁ గైలాసశిఖరి
ముంగిట గండోపలములు ♦ మునికొనియుండన్
లింగాకృతితో నయ్యవి
గంగాస్రోతోనిపాత ♦ కషితము లయ్యెన్. 39

శా. లింగాకారము తోడనున్న శిలలన్ ♦ లీలావిలాసార్థమై
నింగిన్ వచ్చెడి వేల్పుకన్నెలు సదా ♦ నిఃఖేదులై నట్టి ని
స్సంగుల్ దివ్యతపోధనుల్ గొలుతుర ♦ శ్రాంతంబు సద్భక్తితో
గంగాభంగ జలాభిషేకమనుచున్ ♦ గౌతూహలప్రక్రియన్. 40

కం. తత్కారణమున నేత
త్కుత్కీలము మీఁద శివుఁడు ♦ కూర్చుండి మహో
పత్కాలమ్మున నిజ భ
క్తోత్కరమును బ్రోచునందు ♦ రుడుగక పెద్దల్. 41

కం. మతిమాలిన కవిచంద్రులు
గతిమాలిన వారలగుచుఁ ♦ గదుకకయెవరో
బతిమాలిన నల్లిరి సి
బ్బితిమాలిన కత యిదియితి ♦ వృత్తముగాఁగన్. 42

కం. ఈచిత్రకథం జెప్పెదఁ
బ్రాచీన కవీంద్రకోటి ♦ పల్కినరీతిన్
"దూచా" లు తప్పకుండఁగ
నీచిత్తాబ్జమునఁ జేర్చి ♦ నిజముం గనుమా. 43

## గంగావతరణము.

ఉ. ఉగ్రమయూఖ సత్కుల స ♦ ముద్భవుఁడై సగరక్షితీంద్రుఁడ
వ్యగ్ర సమగ్రజాగ్రదసి ♦ పాటితవైరినృపుండు, నిగ్రహా
నుగ్రహశక్తిశాలి, యప ♦ నోదిత పాపచయుండు తొల్లి ప్ర
త్యగ్రయశస్వియై భరత ♦ ధారుణి నేలె సనాతనంబుగన్. 44

చం. సగరనృపాలమౌళి భుజ ♦ సారుఁడుదారుఁడు వైరివీర వా
రగురు చమూప్రణాశన ప ♦ రాక్రమ భద్రకళాకుశీలవుం
డగణితవైభవోన్నతిని ♦ నాప్తవచోగతి నశ్వమేధముల్
సుగతులఁ గోరి చేయుటకుఁ ♦ జొచ్చెనుముప్పిరి గొన్న వేడ్కతోన్. 45

ఉ. క్రించుదనమ్మునన్ రిపులు ♦ రేగి తిరస్కృతిఁ జూపకుండు లా
గెంచి సమస్తశత్రు పృథి ♦ వీశ్వర సీమల సంచరింపఁగా
బంచెను దివ్యలక్షణవి ♦ భాసిత జాతి తురంగరత్నమున్
మంచిముహూర్తమందు బుధ♦మండలి మెచ్చఁగ శాస్త్రసమ్మతిన్. 46

సీ. విడచిపుచ్చిన తేజి ♦ విశ్వంభరాస్థలి
ఖురపుటంబుల చేతఁ ♦ గొట్టికొట్టి
ధారావిశేషంబు ♦ దైవార నుప్పొంగి
నింగి మీఁదికిదాఁటుఁ ♦ జెంగలిడుచు
హయపాలకులు దిగ్భ్ర ♦ మాయత్తచిత్తులై
తేజి యాగడ సుంత ♦ తెలియలేక
వెనువెంటఁ బోయెడి ♦ వెఱ వెఱుంగఁగ లేక
తేజి నిల్పఁగ లేక ♦ తెగవు లేక

గీ. పుడమి పతికి నివేదింప ♦ వెడలిపోయి
యజ్ఞ దీక్షితుఁడైన ధ ♦ రాధినేత

సగర సార్వభౌముని జేరి ♦ సంగతులను
విన్నవింప నాలించి పృ ♦ థ్వీ వరుండు. 47

చం. అఱువదివేల పుత్త్రకుల ♦ నందఱిఁబిల్చి తురంగరత్నముఁ
సురపురినున్నఁ డెండు మద ♦ శోభితులై రిపులెవ్వరేనియున్
బోరిఁబోరి సడ్డువచ్చునెడ ♦ బోరలుచీల్చుచు సూర్యవంశపుం
బరువు, ప్రతిష్ఠ నిల్పి గరు ♦ వంబును జూపుఁడటంచుఁబంపఁగన్. 48

సీ. ఉత్సాహపూర్ణులై ♦ యుద్భటారభటులై
యుద్వేగవంతులై ♦ యోర్పు లేక
సగరావనీభర్త ♦ సంజాతులెల్లరు
వార్వంబు నెమకంగ ♦ బయలుదేరి
వారాశిపర్యంత ♦ వసుమతీ తలమెల్ల
గాలించి గాలించి ♦ కత్తలాని
ఎచ్చోటఁగనరాక ♦ యేమేనితోఁచక
ముడివడ్డ మోముతో ♦ మునుఁగువెట్టి
గీ. యురుపరీభావ ఖిన్నులై ♦ యొక్కచోటఁ
గూడి యందఱు కర్జంబు ♦ లాడికొనుచు
నసకమున వారిలో నొక్కఁ ♦ డౌదుఁగఱచి
తెలివివాఱిన మోముతోఁ ♦ బలికె నిటుల. 49

చం. కొకిబికి కొండగూడెములు ♦ గుట్టలు మెట్టలు చెట్టుపుట్టలున్
బెకబెకలాడు మాడెములు ♦ పిల్చినఁ బల్కెడి పట్టణంబులున్
సకలముఁజూచి చూచియును ♦ జాతరజక్కినిగాంచమైతి మే
మొకమున భూతలేశ్వరుని ♦ మోసలఁజేరఁగ నేర్తు మైననున్, 50

చం. తెలిపెద నాలకింపుఁడొక ♦ తీరును యజ్ఞ తురంగమెంతయో
తెలివి కలట్టి దీ కుతల ♦ దేశమునందెట డాఁగియుండినన్

నలువురుచేరి పట్టుకొని ♦ న్యాదముఁ జేసెదరంచు వే రసా
తలమున డాఁగనోవునిది ♦ తథ్యము తప్పదటంచుఁ జెప్పుచున్. 51

కం. జన్నము పాడై పోయిన
మన్నింపఁడు తండ్రి మనల ♦ మక్కువతోడన్
మున్నెన్నఁడు చేకూరని
విన్నదనము సూర్యవంశ ♦ వీరులకబ్బున్. 52

కం. కావునఁ గుతలంబెట్టైటో
వేవేగన్ గ్రొచ్చి త్రవ్వి ♦ ద్విట్చక్రంబున్
జావఁగఁగొట్టి హయంబున్
భూవరునకు నీయవలయుఁ ♦ బోడిమిననఁగన్. 53

చం. అగునగునంచు రాకొమరు ♦ లప్పుడే కొఱముట్లుతెచ్చి వా
రగణిత శక్తిసంపద న ♦ వార్నిశలుం ధర గ్రొచ్చిగ్రొచ్చి యే
పగిదినినైన ఘోటకముఁ ♦ బట్టి నృపాలవతంసు యజ్ఞమున్
ముగిసెడునట్లు చేయుటకుఁ ♦ బూనిరి క్రొవ్వితదేకచిత్తులై. 54

చం. బొరియలుపెట్టి తాల్మిఁగొని ♦ భూమినిద్రవ్వఁగ ఆతిలోపలన్
వరలెడికప్పురీతి నొక ♦ వైపున గోచరమయ్యె ముంగలన్
దురగమొకండు మానికుల ♦ ధూర్వహుఁడౌ కపిలుండు ధారుణీ
శ్వరతనుజాతులందఱును ♦ బాపురె! బాపురెయంచునార్చుచున్. 55

కం. గికురించిమనల నీ ఘో
టకముం గొనితెచ్చి యిచ్చు ♦ టన్ జపమనుచున్
ముకుమూసికొనియె వీఁడని
యెకసక్కెములాడుచుండ ♦ ఋషిచంద్రుండున్. 56

చం. తపమును బాసి కోప పరి ♦ తాప పరాభవతప్తచిత్తుఁడై
కృప యనుమాట రోసి తమ ♦ కించి శపింపఁ గసాయతాక్షుఁడై
చపలుల దిక్కుఁ జూచునెడ ♦ సార విహీన వివర్ణ దేహులై
కపిలునికంటి మంటఁబడి ♦ క్రాఁగిరి బూడిదయైరి వెంటనే. 57

కం. సగరుం డీ వృత్తాంత మె
ఱిఁగి వేగులవారివలనఁ ♦ బ్రియపౌత్రునికిన్
సుగుణాఢ్యునంశుమంతుఁ డు
రగముం గొనితేరఁబంపెఁ ♦ బ్రతలంబునకున్. 58

గీ. అంశుమంతుండు మతిమంతుఁ ♦ డగుటచేతఁ
జేతమున సంభ్రమంబును ♦ జెందకుండఁ
గపిలసన్నిధిఁజేరి ని ♦ ష్కపటబుద్ధి
మ్రొక్కి వచ్చిన కార్యంబు ♦ వక్కణింప. 59

ఉ. అక్కటికంబుతోఁ గపిలుఁ ♦ డప్పుడు నొక్కి వచించె "నీపితల్
చక్కటిఁదప్పి సాధుల వె ♦ లార్చుచు బూడెద బొక్కణంబులై
మ్రొక్కిరి, నీవు మమ్ము బతి ♦ మాలఁగ వచ్చితి వందుచేత మీ
జక్కిని నీవు తీసికొని ♦ సాఁగుము మీ నరపాలు వీటికిన్". 60

గీ. "బూదె రాసులై పడిన మీ ♦ పూర్వులకును
గతులు కల్పింపనెంచుచోఁ ♦ గష్టమనక
మింటివఱ్ఱును గొనితెచ్చి ♦ మిడుకకుండఁ
దడుపు"మని యంశుమంతుతో ♦ నుడివిపంప. 61

వ. అంశుమంతుఁ డంతట కపిలమహాముని యామంత్రణంబు వడసి యజ్ఞాశ్వంబును గైకొని, యజ్ఞదీక్షితుఁడయిన తాతకు సమర్పింప

యజ్ఞంబు పరిసమాప్తిఁగావించి సగర సార్వభౌముండు కాలాను
సరణంబుగా, దివంగతుఁడైన, నఖిలభూజనమునకుఁబ్రియంబుగాఁ
బట్టాభిషిక్తుండై, తాతలు సుగతిహీనులగుటకు నతిదుఃఖితుఁడై.

గీ. ప్రథితగుణుఁ డంశుమంతుఁ డ ♦ త్యధికభక్తిఁ
దాతలకు సద్గతులు గూర్ప ♦ దైత్యవైరిఁ
గూర్చి ఘోరతపముఁజేసి ♦ కొట్టకొనకుఁ
జేయునది లేక ముక్తిని ♦ జెందెనంత. 63

గీ. అంశుమంతుని పౌత్రుఁ ♦ డౌ భగీర
థుండు నిష్ఠాగరిష్ఠుఁడై ♦ దొడ్డతపముఁ
గాలి బొటమనవ్రేలిపై ♦ గాలిఁదినుచుఁ
జేసి గంగాశివులను మె ♦ చ్చింపనపుడు. 64

సీ. కడలెత్తి మ్రోగుచు ♦ నొడలెఱుంగక గంగ
చిడిముడిపాటుతో ♦ మిడిసిపడుచు
సుడిగుండములతోడ ♦ శూన్యంబులోనుండి
నుచ్చిళ్ళుగ్రుక్కుచు ♦ నులిసి నులిసి
శివ జటాజూటంబుఁ ♦ జేరి యందుండి బ్ర
హ్మావర్తదేశంబు ♦ నందుఁ జొచ్చి
త్రోవఁజూప భగీర ♦ థుని వెంటఁ గ్రేళ్ళు
కుచు సాఁగి దేశముల్ ♦ కొన్ని కడచి

గీ. సగరవసుమతీశ్వర తనూ ♦ జాతచయము
గ్రొచ్చి త్రవ్విన బోరియల ♦ గుండఁబోయి
బూదెరాసులఁ దిన్నఁగాఁ ♦ బొడిచి తడిపి
గతులు కల్పించెనంట దు ♦ ర్గతుల కంట. 65

వ. ఏతన్మూలంబున మందాకిని, భాగీరథీనామంబున జగద్విశ్రా
వంబుఁగాంచి, పతితపావనియను వాసిఁగాంచెనంట. 66

గీ. బొరియ లేదు పెట్టి ♦ భూమండలముఁద్రవ్వి
గంగనీరుఁదెచ్చి ♦ కడుపునింప
జలధు లేడుగల్గె ♦ సగర భూజానికి
ముందు లేదహో ! స ♦ ముద్రచయము. 67

ఉ. సప్తసముద్ర సంతతి వి ♦ శాల మపారమగాధమై పరి
వ్యాప్తముగాన నెట్టులొక ♦ వాహిని నీరము నింపునంచు సం
తృప్తులుగాక కొందఱొక ♦ తీరునఁ బల్కెదరంతెకాని ప
ర్యాప్తముగాఁగ రేయిఁబవ ♦ లవ్వలనింపిన నిండకుండునే ? 68

గీ. వెగ్గలపుఁ బట్టుదల నొక్క ♦ వగ్గుతపసి
పుక్కిటనుబట్టి తిన్నగాఁ ♦ బుక్కిలింపఁ
జాలని జలంబుఁ గూలంక ♦ షామతల్లి
యొకటి గొనితెచ్చి యొకచోట ♦ నుంపలేదె ? 69

సీ. గగనంబులోనుండి ♦ గంగమ్మ శివుమస్త
మున దూఁకె ననుమాట ♦ ములుదమాట
అతితపోనియతిచే ♦ నల భగీరథుఁడు గం
గను దెచ్చెననుమాట ♦ కల్లమాట
గంగాజలంబుచేఁ ♦ గంథినిండింపఁగాఁ
బడియె నుమ్మనుమాట ♦ బడుగుమాట
శైవ జటాజూట ♦ సక్తయై తిరుగాడె
వేల యేండ్లనుమాట ♦ వెఱ్ఱిమాట

గీ. సగర సుతభస్మరాసుల ♦ సరవిదడిపి
స్వర్గమునకంపె ననుమాట ♦ వట్టిమాట
టక్కునేర్పెడి కవుల గం ♦ టాలవ్రాత
కాదనఁగరాదు ప్రాచీన ♦ కవులుగాన. 70

శా. గంగామూల మెఱుంగఁగోరి సగర ♦ క్ష్మానేత్ర పౌత్రుండు వే
గంగాకూలముఁ బట్టిపోయి తుదకుం ♦ గార్యంబు సాధింప శీ
ర్ణాంగుండై మరణించెఁ దత్కథను బ ♦ ర్యాలించి తత్పుత్రుఁడు
త్తుంగఖ్యాతిని బొందెఁ బట్టినపనిన్ ♦ దుర్వారుఁడై తీర్చుచున్. 71

కం. గంగాతటినీమూలము
సాంగముగ నెఱిఁగి భగీర ♦ థాఖ్యుఁడు పృథుకీ
ర్తింగనె భాగీరథియని
గంగాశైవలిని దాన ♦ గణుతికినెక్కెన్. 72

కం. వినువారలున్నఁ గథలన్
వినిపించెడి వారుగల్గ ♦ విస్మయమగునే ?
విని కని చక్కఁగ నిజముం
గనుఁగొనఁగా వలయుఁగాని ♦ కాదనకుండన్. 73

సీ. కైలాసగిరిముందుఁ ♦ గల గండశైలంబు
పుడుకలిచ్చెడి లింగ ♦ మూర్తిగాఁగ
అల్లిబిల్లిగఁ జుట్టు ♦ నల్లు పుష్పలతాచ
యంబు చంద్రార్ధ జూ ♦ టంబుగాఁగ
ప్రస్థంబుపై నుండి ♦ పడుచున్న జలధార
తరళగంగాప్రవా ♦ తంబుగాఁగ

పడి జాలుగాఁ బాఱు ♦ వట్టు భగీరథు
నడుగంటి చను గంగ ♦ నడకగాఁగ

గీ. సమ్యకంబుట్టిపడునట్టు ♦ నక్కి బుద్ధి
పూర్వకంబుగా లోకముం ♦ బుండలించి
చిత్రకథవ్రాసినారు ప్రా ♦ చీనకవులు
స్వార్థమో! పరార్థమొ !! భగ ♦ వంతుఁడెఱుఁగు. 74

వ. అనంతరంబు ప్రకృతిశిల్పకళానైపుణ్యంబున కచ్చెరువుపడి, హిమాలయ పర్వతపు నెత్తమ్మునుండి క్రిందికిఁ జూచుడు నాకాసంబున నున్న చాయఁగన్పట్టు విస్మయంపడుచు గంగావతరణంబుఁ జేసి. 75

కం. గురుతర హిమవద్ధరణీ
ధరపరిసరముత్తరించి ♦ తత్పరమతితో
మరుభూములఁ గని మరలితి
సురకరువలి చుట్టుముట్టి ♦ నుడిముడిపెట్టన్. 76

గీ. మంచుగప్పిన మరుభూమి ♦ మండలంబు
మీఁదఁ బడి యేటవాలుగా ♦ మిహిరకిరణ
పాళి కన్ను చెదరునట్టు ♦ ప్రతిఫలించి
యినుమడించి వినీథికి ♦ నెగయుచుండె. 77

చం. అరుదగు గుట్టమిట్టలను ♦ నన్నిటిఁ జూచుచుఁ బోయి పోయి యు
త్తరకురుభూములంగడచి ♦ దవ్వులనున్న త్రివిష్టపంబు నం
బరపడి చూచి యాపొలము ♦ పచ్చికబీళ్ళను దోట దొడ్లనున్
వరుసగఁగాంచి యట్టె నిలు ♦ వంబడిపోతి భ్రమాకులుండనై. 78

చం. విపుల సరోవరంబొకఁడు ♦ వీక్షణమాలిక కడ్డురాఁగ నే
నపుడు తలంచినాఁడ నిది ♦ యాఁగదమానసమంచు భంగముల్
తపతపమంచుఁ గూలములఁ ♦ దాఁకుచుఁ బైఁబడుచుండ నింతలో
రెపరెపమంచు లేచిచనె ♦ ఱివ్వున మింటికి రాజహంసలున్. 79

ఉ. బంగరు పూతఁబూసినవి ♦ భాతిని దోఁచెడి తమ్మితూండ్లతోఁ
దొంగలి ఱేకులందెగడి ♦ దూకొనివచ్చెడి కమ్మతావులున్
రంగరువన్నె చిన్నెగల ♦ రంగుపులుంగుల నంగికూయి యు
ప్పొంగఁగఁజేసె నన్నుఁ బరి ♦ పూర్ణ రసానుభవంబుఁగూర్చుచున్ -

ఉ. ఏమియు దూరభారమని ♦ యెంచక నేను దివిష్టపంబుఁ గ
న్గోమదిఁ బట్టుఁబట్టి యిది ♦ గో! యదిగో!! యని పోయి పోయి వి
డ్డా! మిహిరుండు కన్పడని ♦ యట్టి పొలంబుల దాఁటిపోయి యా
యా మడ లుత్తరించి మఱి ♦ యామడలెన్నియొ యేగి నిల్వఁగా.

సీ. దూదిపింజలరీతి ♦ దులదుల పడసాఁగెఁ
బైనుండి హైమంబు ♦ పట్టపగలె
పూగుత్తులను భ్రాంతి ♦ పుట్టఁగా మిక్కిలి
కసిదీర వడిగండ్లు ♦ విసరికొట్టె
మిట్టమధ్యాహ్నంబె ♦ మిథునముల్ చెలరేఁగి
చెట్టుచెట్టులచుట్టు ♦ చేరసాఁగె
కనుఱెప్పపాటులో ♦ గలిసినమిథునమ్ము
లప్పుడే తారుమా ♦ రగుచునుండె

గీ. చేతులును గాళ్ళు క్రొవ్వాలి ♦ చేతనపుడు
కొంకరలు పోవఁజొచ్చెను ♦ గొలఁది కొలఁది

వింత దేశంబు దీనిలో ♦ వేగుబెట్టు
లనుచు నాందోళితస్వాంతుఁ ♦ డైతి నేను. 82

గీ. పాఱు సెలయేళ్ళ నీటితుం ♦ పరలతోడ
విరుల క్రొందావి విరఁజిమ్ము ♦ తరులనీడ
సురల యాచారములనెల్లఁ ♦ జూడఁగోరి
యెదురుచూచుచు నిలుచున్న ♦ యింతలోన. 83

—♦ త్రివిష్టపసందర్శనము ♦—

కం. లెంకలు వంకల నిలఁబడి
యంకిలిమాన్పన్ స్ఫురత్సు ♦ మాంచద్ధూళీ
సంకిల ఘంటాపథమునఁ
బంకేజాతాస్యయోర్తు ♦ వచ్చుచునుండన్. 84

గీ. అంగజాలల నెవ్వరీ ♦ యాఁడుపడుచు
తెల్పుఁడంచును నేను బ్రా ♦ ర్థించినంత
వారు తెల్పిరి యూర్వశీ ♦ భామ యీమె
యధికలావణ్యసీమ, పే ♦ శ్యాలలామ. 85

గీ. ఎదురులేనట్టి నెఱజాణ ♦ యెమ్మెలాఁడి
యీమె వాంఛితార్థంబు లీ ♦ డేర్చుకున్నఁ
దిట్టుఁ దినకుండఁ బోవ లే ♦ రెట్టివారు
మాటినంగ యాయమ యంచు ♦ మాటఁదెల్ప. 86

చం. దడదడలాడె గుండెలు య ♦ దాయదలైమును దొంగప్రొద్దునన్
విడివడిపోయి పైకొనఁగ ♦ వెంపరలాడుచుఁ జేర నర్జునుం
డొడబడకుండినం గినిసి ♦ యుంకి, నపుంసకుఁజేసె నీమె నేఁ
డుడుగునె యొంటి నన్నసిన ♦ నుక్కిరి బిక్కిరి చేసి చంపదే. 87

గీ. బండవానిచేతి చిలేలు ♦ బదరు వేల్పు
టాలి కీల్జడ వ్రేటు పై ♦ డేలుమనఁగ
సొమ్మసిలకుండఁ గన్నీరు ♦ గ్రమ్మకుండ
నొంటిప్రాణంబుతోనైన ♦ నుండుటరిది. 88

గీ. గిల్లుకొలుకుల పాత్రంబు ♦ నెల్లఁజదివి
యారితేరిన యామె స ♦ య్యాటలందు
బడుగు బైరాగి కెట్టు లీ ♦ పాట్లు తెలియు ?
వంగి జోహారుఁజేయు టే ♦ పాటియెఱుఁగు ? 89

గీ. మర్త్యలోకవాసుఁడనెడి ♦ మాటవిన్నఁ
బులకరించెడి మేనితోఁ ♦ బొంగిపోయి
యీమె మోహాంబునిధిలోన ♦ నీదులాడు
ననుచుఁ బెద్దలు చెప్పెద ♦ రామెఁగూర్చి. 90

వ. అంచుఁ గొంతవడి వితర్కించి, యీమె బారి కగ్గముగాకుండు
టుచితంబని తలంచి, యోగమాయాప్రభావంబున నదృశ్య
శరీరుండనై దేవలోకంబు నాల్గుమూలలు గాలింప నుంకించి
దశదిశలుపలక్షింప. 91

సీ. ఎత్తైన నెత్తమ్ము ♦ లెక్కి బారలు చాప
శిశిరాంశు బింబంబు ♦ చేతఁజిక్కు
పరికించి కనుగొన్న ♦ భారతఖండంబు
ప్రతలంబు రీతిఁ గ ♦ న్పట్టుచుండు
చదలంటు మ్రాకుల ♦ నందుగొందులదూరి
కుందును బిచ్చుక ♦ కుంటువేల్పు

నీలాబ్దమాలికా ♦ నిచయంబు చెలరేఁగి
కోట కొమ్మలఁజిక్కి ♦ కొనుచునుండు

గీ. నభ్రవీథీ విటంకంబు ♦ నందరుగు వి
మానములు సౌధములఁదాకి ♦ మరలుచుండు
నాపురీ సంస్థితులను గ ♦ న్నారఁజూడ
మేఘమండలమందున్న ♦ మెలపుదోఁచు. 92

వ. నేసంతట నెమ్మదిగా నడుగులు లెక్కించుకొనుచు ముందులకుఁ
బోవంబోవ. 93

సీ. నగ్నలై రాగ ని ♦ ర్మగ్నలై చదలేటి
యందున జలకంబు ♦ లాడువారి
జున్నను తేంట్లతో ♦ జాజంబులాడుచు
హరిచందనము క్రింద ♦ నొరగువారి
కోడాడు కొంగొత్త ♦ కోడెకాండ్రనుజూచి
వాలారుచూపులఁ ♦ బట్టువారి
మేలువారలఁగూడి ♦ మిన్నేటి యిసుకతి
న్నెలను వెన్నెలరేల ♦ మెలఁగువారి

గీ. గంగగట్టునఁ గడిమిడి ♦ గట్టి నేల
నీరములపొంత తమయంత ♦ కూరుచుండి
చిత్తరువు వ్రాయు బిత్తర ♦ చేడియలను
నివ్వెర నడిపోయితి నిదా ♦ నించిచూచి. 94

గీ. కంచుకంబుఁదీసి ♦ కడగంటితోఁగాంచి
జడుపు లేక దుమికి ♦ మడుగులోన

నీతకొట్టుచున్న ♦ యిగురుబోఁడి యాకర్త
కన్నుసైగఁజేసె ♦ నన్నుఁజూచి. 95

గీ. మసకలాడు నాగుల మాడ్కి ♦ మసలి బాహ్యా
లోక మాదమఱచి రస ♦ లుబ్ధులగుచు
గాఢతర పరిష్వంగ సౌ ♦ ఖ్యమునఁదేలు
వేల్పుజంటలఁ గనుఁగొంటి ♦ వెంటవెంట. 96

ఉ. బంగరు తమ్మిపూలగమి ♦ ప్రస్ననితావులఁ జిమ్ముచుండఁగాఁ
జెంగటఁ జిందుగాంగజల ♦ శీకరముల్ మెయిఁ దద్దుచుండ స
ర్వాంగకముల్ వడంకఁగ మ్ర ♦ గాజినముక్ బయిఁగప్పుకొంటి భ
స్మాంగుఁడనై యలంచునివ ♦ మంతయుఁబోవఁగ నొక్క పెట్టునక్.

వ. త్రసరేణుపటలంబు సుమపరాగజటిలంబయి తుషారసించితం బగుటచే నుబ్బలియగు త్రోవను "జారిపడుదునేమో" యను శంక నెమ్మదిగ నడుగులిడుచు నూర్వశీ పర్వేందుముఖి గంధర్వవరుని చెట్టఁబట్టి సురపొన్నగున్న క్రిందకుంజని క్రీడోత్కంఠత నన్యోన్యపరీరంభసుఖాప్తింబొందుచుండ గీర్వాణభటుండొక్క రుండు హుటాహుటిం జనుదెంచి దేవతాసార్వభౌముని యాదేశంబు దేవతాంగనకు విన్పింపఁ గ్రీడాభంగసంభవోన్మాదంబున నాగణికామణి యిట్లు గొణిగికొనియె. 98

సీ. విష్టపత్రయమందు ♦ విఙ్జుఁ డెవ్వండేని
తపము సల్పుచునున్నఁ ♦ దల్లడిలును
తనకొంప గూలిపో ♦ యినరీతి నాహార
పానీయములు మాని ♦ పల్లటిలును
అసమర్థుఁడై భీరు ♦ వై ప్రతీకారంబుఁ
బచరింపఁజాలు ని ♦ బ్బరములేక

మంత్ర తంత్రంబుల ♦ మాటున జవరాండ్ర
మాలిమితో బతి ♦ మాలి, యింటి

గీ. పట్టునం బదినాళ్ళని ♦ పట్టుమనుచుఁ
గుడిచి కూర్చుండనీయఁడీ ♦ కుత్సితుండు
రేయిఁ బవ లెల్లలోకముల్ ♦ దిగ్భ్రమరంగఁ
జెప్పివంపించుఁ దనమాట ♦ చెల్లుననుచు. 99

గీ. ఆఁడు తోడునఁ బుట్టిన ♦ వాఁడుకాఁడొ
ఆఁడువారల యగచాట్ల ♦ నాలకించి
యాదరింపఁడు, స్వర్గంబు ♦ నందునున్న
వేల్పు సానులగతులిట్లు ♦ వేగుచుండె. 100

వ. అంచు రోషించి మంత్రరుద్ధభుజంగమవోలె, నాభుజంగి చేయు
నది లేక నిట్టూర్పువిడచి. 101

గీ. వదలలేక వదలలేక ♦ వదలి ప్రియుని
బాహుపంజరమ్మునుండి ♦ బయటఁబడుచు
బాష్పసంరుద్ధకంఠమై ♦ పలుకలేక
యూర్వశీకాంత దేవేంద్రు ♦ నొద్దకంత. 102

కం. తడబడు మెల్లని నడతో
విడివడి వ్రేలాడుచున్న ♦ పీలినజడతో
నుడుగని యూర్పుల వడతో
దుడుకునఁ గన్నట్టుచున్న ♦ తోడతోఁ జనిరెూ. 103

గీ. అపటి మిన్నేటినారను ♦ నరుగునాకు
నినుకతిన్నెల నెలరాల ♦ యిండ్ల నాట

పాటలందు మునిఁగి తేలు ♦ స్వైరిణీజ
నమ్ము దేవకన్యా నివ ♦ హమ్ముదోఁచె. 104

గీ. సురనువాచేరఁ దెగఁద్రావి ♦ సోడుముట్ట
మైమఱచి నేలపైఁ గూలి ♦ మరులు కూన
రాగములుతీయు గోవాండ్రు ♦ రాగరస ని
మగ్నతనుజూచి యానంద ♦ మయుఁడనైతి. 105

గీ. వాక యుద్దరినున్న మ ♦ ధూకవనముఁ
బాసి వచ్చు సుమాళంపు ♦ వగరుతావి
నాసికాపుటిఁజేరి యు ♦ న్మత్తుఁజేయ
దిగ్భ్రమాకులుండనగుచుఁ ♦ దెన్నుదప్పి. 106

ఉ. చక్కని రాచబాటఁబడి ♦ సాఁగుచుఁబోవ నశోకవృక్షముల్
చిక్కని పూవుఁదేనియలు ♦ చింది పయింబడఁ గార్చుచుండఁగా
నక్కని జంపుజొంపముల ♦ మాటున డాగిన పూవుగుత్తులున్
జిక్కణమైనరీతి విరఁ ♦ జిమ్ముచునుండెను గమ్మతావులున్. 107

కం. చల్లని మ్రాకుల నీడను
మల్లాడుచునుండ మార్గ ♦ మధ్యమునందున్
జెల్లని యుడుపుల దొడిగిన
గల్లంతులమారి జాణ ♦ గకవికనవ్వెన్. 108

కం. వలిపంపుఁ జీరఁగట్టియుఁ
గలపంబునుబూసి కర్ణి ♦ కారముఁ జెవులన్
వెలయఁగ సొగసుగ నిల్చిరి
వలభీపార్శ్వంబులందుఁ ♦ బల్లవపాణుల్. 109

కం. కలకల నవ్వుచు దిశలన్
గలకలమను నెమ్మొగంబు ♦ కాంతులు పర్వన్
గలకంఠస్వరములతోఁ
గలవాణులు పాడుచుండఁ ♦ గా విని యంతన్. 110

గీ. రాచబాటను విడనాడి ♦ ప్రక్కనున్న
చంద్రకాంతశిలాచయ ♦ స్థగితమైన
వీథిఁబడి పోవుచుండఁ ద్రి ♦ విష్టపమునఁ
గానరాని విడ్డూరముల్ ♦ గానిపించె. 111

సీ. శ్రోత్రియవరుఁడైన ♦ సోమయాజులు సాని
కొంప తల్పులు చేతఁ ♦ గొట్టుచుండ
వీరగంధముతోడఁ ♦ బెనఁగి కూలిన మల్లు
సానివాడఁ బచారు ♦ సల్పుచుండ
యజ్ఞయాగాదుల ♦ నాచరించిన యోగి
రోవడంతుల యిండ్లు ♦ రోయుచుండ
నిట్రించి తపములో ♦ నెగ్గిన జటిలుండు
బోఁజుగుబోటుల పోఁజు ♦ పొంతనుండ

గీ. దారి తెలియక జడదారి ♦ తారుచుండఁ
గొంటె తెఱగంటి కన్నె గ ♦ న్గొట్టుచుండ
సనుపుకాఁడట్టె పెడనవ్వు ♦ నవ్వుచుండ
సల్లకల్లోలమైయుండె ♦ నాకపురము. 112

చం. విసవిస సోమయాజి యొక ♦ వీథిని బోవుచు వేశ్యకాంతతో
గుసగుసలాడుటెల్లఁ గని ♦ కోపనగావున సోమిదమ్మయున్
బుసబుసలాడి భూస్థలిని ♦ బోకడ లిట్టివియున్నె యంచుఁ దాఁ
దసతస పూవుటీరమొక ♦ దానిని దాఁకెను దొంగదారినిన్. 113

కం. ఎదురగు మదిరాక్షుల కే
నొదిగి యొదిగిపోవ వారి ♦ యూర్పులవలిచే
మదిరాసవ వాసనచే
మది మదిలోలేక తాఱు ♦ మాఱుగనుండెన్. 114

వ. అంత నా గబ్బుగొట్టుచే నుక్కిరిబిక్కిరియై నటులుండి యేమియుం దోఁచక, నే నిటునటు పోయి, పోయి, కొలువుఁదీర్చియున్న వేలుపు సురతాణిహజారముం జేరి, మణిమయపట్టభంగమ్ములభంగమ్మునందక దౌవారికులం ద్రోసికొని, నిండోలంబుఁజొచ్చి విలోకించుడు. 115

కం. ప్రాచీనబర్హి విలసత్
ప్రాచీదిక్పాలకుండు తగఁ ♦ గూర్చుండెన్
బ్రాచీన బర్హిపీఠిని
వాచంయమి గణముకొల్వఁ ♦ బ్రాభవమొప్పన్. 116

సీ. మోళికట్టెడువాని ♦ మోచేయికడనుండు
కోలెమ్ముకొకప్రక్క ♦ గునిసియాడ
దనుజుండొనర్చిన ♦ దండచే మచ్చలు
పునుగు పూతలలోనఁ ♦ బొనుఁగుపడఁగ
జారుచుండిన యాడు ♦ సవరించుకొని తుంబు
రుండు పాటలుపాడి ♦ యొప్పుచుండ
తెఱగంటిబోటులు ♦ తెఱచినకనులతో
వింజామరలుపట్టి ♦ వీచుచుండ

గీ. రాజసంబు దీపింపఁగా ♦ భ్రాజమాన
విమల చింతామణీ భద్ర ♦ పీఠమందు
నంగజాలలు సందడి ♦ నాఁగుచుండఁ
కొలువుఁదీర్చి మహేంద్రుండు ♦ కూరుచుండె. 117

ఉ. భోగములాసఁజేసి చని ♦ పోయినపిమ్మట వానిఁ బొందఁగా
యాగము లాచరించిన ధ ♦ రామర దీక్షితకోటి ముంగలన్
గాగర కొంగుదాఁకునటు ♦ గంతులు వైచెడి స్వర్గ వారకాం
తా గజదంత దంతురిత ♦ తాండవకేళిని గంటిముచ్చటన్. 118

కం. తెఱగంటి దొరనుఁ జూచినఁ
దిరముగ సందేహమొండు ♦ దీరెను నాకున్
దెరఁ దీసినభాతిగ నా
తెరఁగును విన్పింతుఁ దేట ♦ తెల్లముగాఁగన్. 119

సీ. ప్రాచీన బర్హినా ♦ వన్నె వాసికినెక్కె
దేవతాపతి దేశ ♦ దేశములను
"ప్రాచీనబర్హి" శ ♦ బ్దమ్ము జానుతెనుంగు
బాసయందుసనౌను ♦ బ్రాతనెమిలి
చిత్రచిత్రంబుగాఁ ♦ జిత్రింపఁబడియుండు
వేలకన్నులు బర్హి ♦ పింఛమందు
వేఁ గన్నులుండెను ♦ వేల్పు ఱేలికమేన
నన్న వదంతిని ♦ నందెదాస

గీ. సకల శబ్దార్థమునుబట్టి ♦ యంకురించెఁ
గాపురుషయోగ్యమైనట్టి ♦ కథ యొకండు
వేయి గన్నులు నాకు గ ♦ న్పింపలేదు
పొడలుమాత్రము గన్పించె ♦ నొడలినిండ. 120

వ. పౌరాణిక గాథా ప్రబంధనిబద్ధములయిన యిట్టి కథలు పెక్కులు గలవు, వానిలోఁ గొన్నింటి నిట వివరింతు దత్తావధానుండవై యాకర్ణింపుము. ఆకర్ణించినపిమ్మట సత్యంబు బోధపడఁగలదు.

సీ. ధరణీంద్రుఁడైనట్టి ♦ దశరథున కరదం
బులు పది గలవంచుఁ ♦ బలుకునటుల
దైత్యేశుఁడైనట్టి ♦ దశకంఠునకుఁ గంఠ
ములు పది కలవంచుఁ ♦ బలుకునటుల
దితిజసేనానియౌ ♦ త్రిశిరునకును మూఁడు
తలలు గలవటంచుఁ ♦ బలుకునటుల
ఋషిపుత్రుఁడైనట్టి ♦ ఋశ్యశృంగునకొక్క
మనుబోతు కొమ్ముండె ♦ ననెడునటుల

గీ. వినుము ప్రాచీన బర్హికి ♦ వేయిగనులు
కలవని పురాణములు పల్కఁ ♦ గంతమెత్తి
వేయికన్నులు నాకుఁ గ ♦ న్పింపలేదు
పొడలుమాత్రము కన్పించె ♦ నొడలినిండ. 122

సీ. మాండూక్యముని లోక ♦ మాన్యుండు మండూక
మునకు జన్మించినాఁ ♦ డనెడిరీతి
సుశ్లోక చరితుండు ♦ శుకయోగి శుకిగర్భ
మున సంభవించినాఁ ♦ డనెడిరీతి
మానితల్లజుఁడైన ♦ శౌనకబ్రహ్మర్షి
శునిగర్భమునఁ గల్గె ♦ ననెడురీతి
అఖిలాస్త్రసంవేది ♦ యైన యశ్వత్థామ
యశ్వమునకుఁబుట్టె ♦ ననెడిరీతి

గీ. వినుము ప్రాచీన బర్హికి ♦ వేయిగనులు
కలవని పురాణములు పల్కఁ ♦ గంతమెత్తి

వేయికన్నులు నాకుఁ గ ♦ న్పింపలేదు
పొడలుమాత్రము గన్పించె ♦ నొడలినిండ. 123

వ. అప్పుడు త్రిదివలోకేశ్వరుని సన్నిధి నంతర్వాణి ద్వయంబునకుఁ బ్రచండవాదంబు ప్రవర్తిల్లుచుండె. ఎవ్వరని యచటివారినడుగ దేవగురుండగు బృహస్పతియు, స్మృతిరచయితయగు మనువని నాకెఱింగించిరి. నేనును వాదంబేమియో, యెట్లు ముగియునో యని వేడుకపడి చూచుచుండ, దేవగురుం డావేశముతో మనువు నుపలక్షించి యిట్లు ప్రశ్నించెను. 124

ఉ. ఊరక యుండలేక యెటు ♦ లో స్మృతియొండు లిఖించెనన్నచోఁ
బేరుప్రతిష్ఠ వచ్చునను ♦ వెంపరి వేడుకవ్రాసితొక్కొ? మీ
భారతవర్షమందుఁ దల ♦ వంపులుగల్గఁగఁ బండితాళికిన్
దీరని వైమనస్యము గ ♦ దించుచుఁ దత్ప్రజకెల్లకాలమున్.125

ఉ. జాతులఁబట్టి మేము స్మృతి ♦ సంహితలన్ రచియింపలేదిటన్
జాతులఁబట్టి తప్పులు వి ♦ చారణఁజేయము శిక్షచెప్పఁగన్
జాతులఁబట్టి ధర్మము ప్ర ♦ చారముసేయము బందుకట్టి నీ
భూత దయాగుణంబునకు ♦ మోదమునందితిఁ జెప్పనేటికిన్. 126

సీ. అజ్ఞాను లొనరించు ♦ నపరాధములకెల్ల
నతిమాత్ర శిక్షలు ♦ న్యాయమయ్య ?
జ్ఞానులొనర్చు దో ♦ షముల కన్నింటికి
నామమాత్రపుశిక్ష ♦ న్యాయమయ్య?
ఒకరీతి నేరంబు ♦ నకుఁ బెక్కురకముల
దండనల్ విధియింప ♦ ధర్మమయ్య ?

భరతవర్షమునందుఁ ♦ బ్రజలకు ధర్మైక్య
పంచారమునుమాన్పఁ ♦ బాడియయ్య ?

గీ. ఆంధ్రులను మ్లేచ్ఛజాతుల ♦ యందుఁజేర్చి
వ్రాసిపెట్టితివిదియేమి ♦ పాపమయ్య ?
ఆంధ్రజాతి గూరిచి యెట్టి ♦ యానుపాను
తెలియకుండంగ స్మృతి నేల ♦ పలికితయ్య. 127

గీ. వానవంగుళ్ళకోర్చి రేఁ ♦ బవలు జెప్ప
వాల్ప కూడిగంబొనరించు ♦ పాత్రలకును
బ్రాత, యెంగిలి, పాల్లును ♦ బ్రతిఫలంబ
టంచుఁ జెప్పితి విదియెట్టి ♦ న్యాయమయ్య ? 128

ఉ. భద్రముఁగూర్పఁగాఁ బ్రజకు♦ వ్రాసితి నీస్మృతివందువయ్యయో!
శూద్రునకున్ ధనంబమర ♦ క్షోభపడున్ జగమెల్లనంచు నే
మాద్రిరచించితో!మనుజ♦మాత్రుఁడుకాఁడొకో శూద్రుఁడక్కటా!
క్షుద్రుఁడవీవొ! లేక మరి•శూద్రుఁడొ! చెప్పను రేంద్రసన్నిధిన్. 

కం. ఒక్కటి యడిగెదఁ జెప్పుము
యెక్కటి "శూద్రంతుకార ♦ యేద్దాస్య"మటం
చెక్కరణిన్ స్మృతివ్రాసితి
వక్కటికము నీకు సుంత ♦ యైనను గలదే ? 130

గీ. కటికవానికిఁ గల్గున ♦ క్కటికమైనఁ
గానరాదు నీయెడల మ ♦ హానుభావ !
ఋషివి యెట్లైతివేగతి ♦ స్మృతినివ్రాసి
ధర్మనిర్ణయమ్మును జేయఁ ♦ దగితివయ్య ? 131

సీ. గరుడ గంధర్వ కి ♦ న్నర కిం పురుషముఖ్య
నానాప్రథిత దేవ ♦ యోనివితతి
జాత్యంతరుల నేక ♦ శతవర్షములనుండి
యిందొకచో వసి ♦ యింప లేదె ?
పక్షపాత విశిష్ట ♦ శిష్టాస్మృతుల మేము
రచియించినార మే ♦ క్రమముఁదప్పి ?
ఐకమత్యముతోడ ♦ నన్నదమ్ములరీతిఁ
జరియింపలేదె పా ♦ ర్చంబు లేక

గీ. ప్రజలయం దెచ్చులొచ్చులు ♦ వర్ధిలంగ
స్మృతులు వ్రాయించు భూపతుల్ ♦ స్మృతులువ్రాయు
పండితావళియున్న భూ ♦ మండలంబె
యదుపులేనట్టి మ్లేచ్ఛ రా ♦ జ్యంబుసుమ్ము. 132

గీ. ప్రజల సమదృష్టితోఁజూచి ♦ రాష్ట్రమందు
నీతిబాధలు లేకుండ ♦ నీతిగల్గి
ప్రజలఁబ్రోచుట రాజధ ♦ ర్మంబు కాని
పక్షపాతంబుఁ జూపింపఁ ♦ బాడియౌనె. 133

వ. ఈ నూటిసోటు మాటలకు మను వులికిపడి క్షణకాలంబాగి యీ
విధంబుగాఁ జెప్పఁదొడంగె. 134

ఉ. అప్రతిమాన బుద్ధి ధను ♦ లై స్మృతులం దలక్రిందు సేయు మా
విప్రులు కొందఱట్టె పల ♦ వించి కడుఁ బలవంత పెట్టఁగా
నప్రతిభుండనై జడుఁడ ♦ నై స్మృతి వ్రాసితి నన్ క్షమింపుడీ
క్షిప్రగతిన్ బ్రమాదపశి ♦ చేసినకార్యముగాన గీష్పతీ! 135

కం. అను మాట లాలకించుచు
    ననిమిషగురుడంతఁ బల్కె ♦ నాత్రముతోడన్
    వినుమని శ్రద్ధాభక్తుల
    మనువు సమాలింపనుండె ♦ మక్కువతోడన్. 136

కం. కల్లారితనముఁ బూనకు
    మిల్లి దిగో ! దివ్యదృష్టి ♦ యిచ్చెద నీకున్
    మెల్లన భారత దేశం
    బెల్లన్ గనుగొమ్ము నిన్ను ♦ నేమను కొనుదో. 137

వ. నేనును భారతదేశకష్టగాథాప్రపంచమంతయు నెఱింగినవాఁడ నగుటచేతను, మనువు బృహస్పతి వాక్యంబులు పూర్వపక్షంబు సేయనేరక డిల్లపడియుండుటచేతను నటనుండ రోసి మగిడి వచ్చుచు స్వర్లోకంబు వీక్షింప బయలుదేర. 138

కం. హిమవాలుకార్ఘురీతతి
    సుమధూళీమిళిత లలిత ♦ శుభామృతమై
    శమితాధ్వోరు శ్రమమై
    ప్రమదోద్యానంబునుండి ♦ పాఱుచునుండెన్. 139

ఉ. ఆ సెలయేళ్ళ గట్టుకడ ♦ యంచుల వెంబడి సాఁగిపోవఁగా
    నానవయోనులైన విపి ♦ ధాగమతండము జాగరూకులై
    కానెలబిగ్గఁగట్టి మడిఁ ♦ గట్టుచు బాదులుత్రవ్వి నీరమున్
    దోసెలఁబోసి పెంచు పువు ♦ దోటలకాపరి మూఁకఁజూచితిన్. 140

—♦ నం ద నో ద్యా న ము. ♦—

గీ. నందనముఁ జూచు కోర్కెలు ♦ నందడింపఁ
    బారిజాత పరిమళంబు ♦ దారిఁజూపఁ

గమ్మతావుల గొజ్జంగి ♦ కాల్వదాటి
నందనోద్యాన వనసీమ ♦ యందుఁజొచ్చి. 141

సీ. ఒకవంక వీక్షింప ♦ నుత్ఫుల్ల సౌవర్ణ
పంకజాత పరాగ ♦ పంకిలంబు
ఒకచాయఁ గనుఁగొన్న ♦ శుకశారికానీక
కోకిల కాకలీ ♦ కూజితంబు
ఒకక్రేవఁ బొడగన్న ♦ వికచమందార పు
ష్ప మరందగురు ఝరీ ♦ ప్లావితంబు
ఒకకోనఁ బరికింప ♦ నురువేపథుస్సిగ్లాని
సంహారకసమీర ♦ చాలితంబు

గీ. మధురవేణు వీణాగాన ♦ మండితంబు
స్వైరకేళీ విహారిణీ ♦ సంకులంబు
విటవిటీ నటీనటపరి ♦ వేష్టితంబు
నందనోద్యాన మానంద ♦ మందిరంబు. 142

చం. తడవులనాఁటనుండియును ♦ దాపసవృత్తిని బూనియున్న నా
కడవులె యాటపట్టులయి ♦ నందునఁ దన్మృగపక్షిజాతులం
దుడుగని నేస్తముంగలిగి ♦ యుండుటచేతను సంభ్రమంబునన్
వెడలితి నందనోపవన ♦ వీథులుచూడఁగ నాల్గుమూలలన్. 143

వ. అంతట నాగుబ్బుగాఁ బెఱిగిన పూఁబొదరిండ్లు, పూఁబొదరిండ్ల నుండి, పూఁదేనె దిగఁద్రావి మత్తిల్లి వెలువడు తేఁటిపాఁజు, తేఁటిపాఁజురొద కులికిపడు బిత్తరికన్నెలు, కన్నెల వెన్నాడు గోవాండ్రనుగల్గి నిత్యకల్యాణము, పచ్చతోరణమై వెలుంగు చుండ నేనిటునటు తిలకించుచుండ. 144

గీ. కొమ్ముటేన్గొక పొదరిల్లు ♦ గుమ్ముమైవ
సంగమొలతో సురాంగన ♦ యంగమై చె
నంగదట్టము విడివడ్డ ♦ నంగరాగ
మంగహారము చేఁ జాల ♦ నంగవింప. 145

ఉ. గుబ్బలిమాటునన్ సురల ♦ కోసము పెట్టిన యొక్క యంగడిన్
గబ్బలికన్నె చెన్నుఁగని ♦ కై వణకన్ సురచింది ముంగిటన్
జొబ్బిలఁ ద్రాగుబోతులట ♦ సోలుచు దూలుచునుండ దారి పె
న్నుబ్బలియైన నందనము ♦ నొక్కెడఁగంటిని ఱిచ్చపాటుతో. 146

గీ. జారుసిగలోన గేదంగి ♦ సరులు తురిమి
జారుపయ్యెంటలోన మం ♦ దారముంచి
నీటుతో నెలకట్టుపై ♦ నిక్కినడువఁ
జారిణీస్త్రీయొకత కాలు ♦ జారిపడియె. 147

గీ. తీగ తూగుటుయ్యాలలోఁ ♦ దీగబోఁడిఁ
గూడి జోడుగ నొకవేల్పు ♦ కోడెకాఁడు
కౌగిలింతల పొంగులోఁ ♦ గాలుజారఁ
గేకిసల్గొట్ట నెడకాండ్రు ♦ క్రిందఁబడియె. 148

కం. వన్నిటి యేటిమీఁదను
బ్రన్ననియొక చిన్నదొన్నె ♦ పైభాగమునన్
గన్నులు మూయని కన్నియ
కన్నుంగవమూయు కోడె ♦ కానిం గంటిన్. 149

గీ. పారిజాత సంతాన పు ♦ ష్పముల నేరి
తెచ్చి మేలు గేదఁగులతోఁ ♦ దెప్పఁగట్టి

పజ్జఁబాతాడు గొజ్జంగి ♦ వాకవిడచి
తెప్పమీఁద నచ్చరలేమ ♦ తేలిపోవె. 150

ఉ. కాతర భావమేమియును ♦ గన్పడనీక యథేప్సితంబుగాఁ
గేతకి కుంజపుంజముల ♦ క్రేవల నావల సంచరింపుచున్
జేతులు చేతులుంగలిపి ♦ చిక్కురు బొక్కురుగాఁగ స్త్రీలతోఁ
బాతరలాడుచున్న మగ ♦ వారలఁగాంచితి నాఁకతోఁటలో. 151

గీ. కామశాస్త్ర నిష్ణాతల ♦ గబ్బితనము
కళలుజార్చెడి నొక్క ప ♦ క్షంబునందె
షోడశకలానిధినిబోని ♦ ప్రౌడకౌర!
వేల్పు జవరాండ్రు పొలయల్క ♦ బేరజంబు. 152

గీ. విరుల తేనెసోనలు వెల్లి ♦ విరియుచుండ
కరుల మదధారలోడికల్ ♦ గట్టుచుండ
భ్రమరకాంతలు నివ్వాళిఁ ♦ బాడుచుండ
నవ్యవైఖరిఁ బొడఁగట్టె ♦ నందనంబు. 153

గీ. వెల్ల గౌరుఁజూచి ♦ వెల్ల జక్కనిజూచి
కల్ప పంచకంబుఁ ♦ గనులఁజూచి
నందనోపవనము ♦ నాల్గుమూలలుఁజూచి
వేల్పుపౌజుఁజూచి ♦ వెడలుచుంటి. 154

వ. ఇంతలోఁ బడమటిదిక్కునకుఁ బ్రొద్దుచాలఁగ్రైవ్రాలుటయుఁ, పెద్దతడవు విరామంబు లేక నలుదిక్కులు మల్లాడుటయు, విపరీతంబుల పెక్కుఁజూచి మనంబు చెదరుటయుఁ, జేయునది లేక. 155

కం. కొంచెము విశ్రామంబును
గాంచఁదలచి యొక్కచెట్టు ♦ కడ కేగంగాఁ

బొంచి లతాంగి యాకత నా
వంచకురా నామెతోడఁ ♦ బల్కితి నిటులన్. 156

కం. ఇందఱు యువతీ యువకులు
క్రిందుగ నున్నట్టిచోటఁ ♦ గన్పించరహో!
చిందులు తెగఁద్రొక్కెడి కసి
గందులు వచియింపుమమ్మ ♦ కారణమన్నన్. 157

ఉ. స్వైరవిహార నిష్ఠమెయి ♦ సర్వదిగంతర దివ్యదేశ సం
చారముఁజేయు మాకు గ్రహ ♦ చారము చాలక సంతుగల్గినన్
వారలనెల్ల గన్న మగ ♦ వారికినిత్తుము కాని పెంచు నా
చారము లేదు స్వర్గమున ♦సత్యముఁజెప్పితినంచు నామెయున్.158

గీ. ఆలకింపుము స్వర్లోక ♦ మందునున్న
మానినులయందుఁ బెండ్లి ఒడ్లు ♦ లేనికార
ణమున మరులెత్తి మర్త్యలో ♦ కమున, దేశ
దేశముల పయింబడి వారు ♦ తిరుగుచుంద్రు. 159

కం. మగనాం డ్రిచ్చటనుండరు
మగవాండ్రన్నన్ దెలియదు ♦ మాబోంటులకున్
మగవాండ్రమనుచు మాపై
మగబీరముఁ జూపరారు ♦ మామగవారల్. 160

వ. అని నిష్కపటంబుగా వచియింప స్వర్గలోక నాగరికంబునకు నాలో నేనేవపడి, యేమిచేయుటకుఁ దోఁచక, మెల్లనలేచి, ప్రక్కకొదిగిపోవుచుండ సురాంగన నన్నుఁజూచి కేరింతలాడ నిట్లు దలపోయఁదొడంగితి. 161

గీ. కల్లునిచ్చెడి చెట్లకుఁ ♦ గల్లు గౌర
వంబు పెఱవానికిని లేదు ♦ వజ్రమ్రోల
గజ్జెకట్టెడి భోగంపు ♦ గరితకున్న
పలుకుఁబడి కానరాదెట్టి ♦ వారికిందు. 162

గీ. ఇండ్లో యున్నవి కాని పెం ♦ డ్లిండ్లులేవు
ఆండ్రో యున్నారు కాని యి ♦ ల్లాండ్రులేరు
బాగు ! శివ ! శివా !! యిది పట్టి ♦ భోగభూమి
యుండరాదిందు మావంటి ♦ యోగులకును. 163

సీ. మిన్నేటిగట్టుపై ♦ మిడుకుదునందునా
కొంచెకన్నియ లీత ♦ గొట్టుచోటు
నందనోద్యానంబు ♦ నందుందునందునా
గోవాండ్ర గమిగుంపు ♦ గూడుచోటు
పాన్నారి పాదరిండ్లఁ ♦ బన్నుందునందునా
కాముకీ కాముకుల్ ♦ గలియుచోటు
కొండనెత్తములెక్కి ♦ కూర్చుందునందునా
చోరవతోఁ బోయాండ్ర ♦ తిరుగుచోటు

గీ. కానమిటఁ జాటుచోటొక్క ♦ జానెఁడైన
మూని జనవాస యోగ్యమా ♦ దానినకట !
బాగు ! శివ !! శివా !!! యిది పట్టి ♦ భోగభూమి
యుండరాదిందు మావంటి ♦ యోగులకును. 164

వ. అని తలంచుచుఁ జేతికందుదూరంబులోనున్న పరిష్కృత నిష్కుటంబును జేరి, కృష్ణాజినంబు సెజ్జగాఁ జేసికొని నాటిప్రొద్దెల్లఁ

జూచిన వింతవింతసంగతులనుగూర్చి విచారించుకొనుచు, నిదురం బోయి, సర్వభూతమనఃప్రియంబగు నుషఃకాలంబున నేలేచి యమరనదికిం జని కాల్యంబులఁ దీర్చికొని, చల్లనినీట స్నానంబాడి మెల్లని పరిమళవాయువులచే సేదఁదేరి, కక్షపాలనున్న భస్మం బునుదీసి, యనన్యమనస్కుండనై, మైనలందికొని చూచుడు భస్మ లేపనంబు, పుష్పాది పూతయయ్యె. నేను దిగులుపడి, నాకంబు విటవిటీ భోగ్యంబుకాని, మానిజనవాసయోగ్యంబుకాదని యెంచి వైశమ భరతఖండంబునకు రాఁ బ్రయాణోన్ముఖుండ నగుటయు. 165

సీ. భస్మలిప్తంబైన ♦ బడుగు దేహపుకాంతి
మంచు కొండలమంచు ♦ సంచుమించ
మధుర వీణాగాన ♦ మహిమంబు గంధర్వ
యువతీజనంబును ♦ నుదుటపఱప
ద్రుతతరంబైనట్టి ♦ గతి చాకచక్యంబు
కాయసిద్ధినిజాటఁ ♦ గల్గుచుండ
సంస్కృతవైయ్యాఘ్ర ♦ చర్మసంత్యాగంబు
నిస్సంగతత్వంబు ♦ నెఱపుచుండ

గీ. త్రిభువనవిహారి నారద ♦ దేవమాని
సంగరహితుండు, శుద్ధాంత ♦ రంగమూర్తి
మోముపై మందహాసంబు ♦ మోసులెత్తఁ
దక్షణంబ నాముగ్రోలఁ బ్ర ♦ త్యక్షమయ్యె. 166

వ. శయోవృద్ధుండును, గుణవృద్ధుండును, బ్రబుద్ధుండును సంకల్పసిద్ధుండును, అనుకంపాబద్ధుండును నగు వీణావాదన

విశారదుండగు నారదునకు నమస్కారంబుఁ జేసి, నా వచ్చిన కార్యంబు విన్నింప, నారదుం డర్ధనిమీలితాక్షుండై యిట్లనియె.

—♦ నారద సూతర్షి సంవాదము. ♦—

కం. అదె! కంటివె! మందాకిని
యిదె! త్రిదివక్షోణి వీర ♦ లెల్లరు సురల
ల్లదె! నందన వనవాటిక
యిదె స్వర్గమని పలుకఁబడి ♦ యెఁ బురాణములన్. 168

సీ. పక్షముల్ కులుచలై ♦ పనుపడఁ బరులకు
గనుఱెప్పలార్చుట ♦ గానరామి
ఇవముచే రేఁ బవ ♦ లివతళించుటచేతఁ
జెమట చిత్తడి దరిఁ ♦ జేరరామి
కూటియెద్దడిమాన్ప ♦ కొఱకునై పడుపాట్లు
ముసలితనంబును ♦ మూలఁద్రోయ
దృఢగాత్రులగుటచే ♦ మృతినొందునందాఁక
వార్ధక్యపదవి చే ♦ పడమిచేత

గీ. ననిమిషులనంగ నస్వేదు ♦ లనఁగ నిర్జ
రులనఁగఁ ద్రిదశులన యోగ ♦ రూఢికెక్కి
స్వర్గలోకౌకసులు పురాణ ♦ చయమునందు
వాసికెక్కిరి సర్వ ప్ర ♦ పంచములను. 169

వ. ఇంతియె కాక త్రివిష్టపశబ్దార్థముం బట్టి యింద్రుఁడు ముజ్జగంబుల దొరయని ప్రసిద్ధివడసెఁగాని బాహుబలంబుచే లోకత్రయంబును జయించికాడు. 170

కం. అనవిని నేనిటు వాకొని
తిని నారదమౌని! భార ♦ తీయులకును స్వ
ర్గ నివాసులకును నేస్తం
బును జుట్టఱికమును రాక ♦ పోకలుగలవే ? 171

గీ. ఓ త్రికాలజ్ఞ ! ధర్మసం ♦ యుక్తచరిత !!
అరసి వచియింపుఁడీ, సుర శ ♦ బ్దార్థమేమొ !
ఎటుల సురలైరొనాకౌకు ♦ లెల్లఁ దొల్లి !!
యాతుధానులెట్లైరో సు ♦ రారులెల్ల !!! 172

కం. అసురులనెడి నామంబెటు
లసురవిరోధిచయమునకు ♦ లభియించెను దా
పసవర ! పుణ్యజనులు రా
క్షసులన నుతికెక్కిరేమి ♦ కతమునఁ జెపుఁడీ. 173

వ. అంత దేవర్షి చంద్రుఁడయిన నారదుండు తెలివివారిన మోముతో నన్నుఁ దిలకించి సాభిప్రాయంబగు మందహాసంబుఁజేసి యిట్లనియె. 174

చం. బహుళనృశంసుఁడై పరమ ♦ పాపపరుండయి పాకవైరి దు
స్సహమగు బ్రహ్మహత్య నెఱి ♦ సల్పి పదచ్యుతుఁడైన దేవతల్
"నహినహి దేవలోకమున ♦ నాయకుఁడౌటకు నర్హుఁ"డంచొగిన్
నహుషుని దోడితెచ్చి సుర ♦ నాథుని జేయుట నీవెఱుంగవే. 175

సీ. కౌమరప్రాయమునాఁడు ♦ కుంతి భోజునిపుత్రి
సూర్యోపగూహన ♦ సుఖముకనదె ?
పుత్రార్థి మాద్రి య ♦ శ్వులఁబొంది రహినొక్క
పర్యాయమె కవలఁ ♦ బడయలేదె ?

మేనకా కనకాంగి ♦ మాని విశ్వామిత్రు
నెట్టన గిరిగీసి ♦ నిల్ప లేదె ?
పుంజికస్థల యాడల్ ♦ పులకరింపఁ బురూర
వునిగూడి పొద్దులు ♦ పుచ్చ లేదె ?

గీ. దశరథుండును ముచికుంద ♦ ధరణివిభుఁడు
దిక్కుమాలిన దేవతల్ ♦ దేవురింప
వచ్చి బాసటమై నిలు ♦ వంగ లేదె ?
పొంగెమున్న దేయని యేల ♦ ప్రశ్నఁజేయ ? 176

గీ. సురయసంగ మద్యంబు త ♦ త్సురనుద్రావి
వినుతికెక్కిరి సురలను ♦ పేరిచేత
సురను నొక్కనాఁడేని యా ♦ చూడకున్న
కారణముచే నసురులైరి ♦ కడమవారు. 177

గీ. ఆర్త రక్షాపరాయణు ♦ లవుటచేత
వాసిఁగాంచిరి రాక్షస ♦ ప్రవరులనఁగ
యాతనా ప్రాణివితతిఁ గా ♦ పాడుకతన
యాతుధానులనంగఁ బ్ర ♦ ఖ్యాతిఁగనిరి. 178

గీ. అటమటీండ్రను దుండగీం ♦ డ్రాచరించు
ధర్మపీడలు దప్పించి ♦ ధర్మపరులఁ
బ్రోచువారు గావున నైరి ♦ పుణ్యపురుషు
లనుచు నారదుండాడిన ♦ యంత నేను. 179

వ. తెల్లంబోయి పౌరాణికగాథలందు రాక్షసులంగూర్చి కర్ణ కఠో
రంబులగు కథలు కలవవియెల్లన్న. 180

ఉ. క్రూర సమీకరంగమునఁ ♦ గూడి చలంబున దేవదానవుల్
పోర జయాభిలాషులయి ♦ పోయి పరాజితులైరి దైత్యుల
వ్వారినిగూర్చి దేవతలు ♦ వారకవ్రాసి రబద్ధసంగతుల్
గారడిచేయలేని యాక ♦ కార్యము కల్గునె లోకమందునన్.181

సీ. గెల్పోటములనొక్క ♦ పోల్కనఁజూచిన
వృత్రాసురుఁడు తత్వ ♦ వేత్తకాఁడె ?
రణనీతిబద్ధుఁడై ♦ ప్రాణముల్ వాసిన
స్వర్ణనేత్రుఁడు నీతి ♦ శాలికాఁడె ?
కాపట్యమెఱిఁగియుఁ ♦ గావ్యపి నిచ్చిన
బలిదైత్యుఁడు వదాన్య ♦ వరుఁడుకాఁడె ?
సమధీతవేద వి ♦ జ్ఞానధనుండైన
విశ్వరూపుఁడు వేద ♦ వేత్తకాఁడె

గీ. న్యాయమగునె వైతండికు ♦ లాడుమాట
పాటిసేయుట నీవంటి ♦ పండితునకు ?
పక్షపాత భూయిష్ఠమా ♦ పాఠములను
వ్రాసిపెట్టెను దేవతా ♦ వందికోటి. 182

వ. అనినయనంతరము నారదమౌనీంద్రుకడ సెలవంది, మనోవేగంబున భాగీరథిందాఁటి, కైలాసంబుత్తరించి, హిమవంతంబునతిక్రమించి, భారతవర్షంబుఁజొచ్చి, నాకై యెదురుచూచుచున్న వాలఖిల్యాదులకు సర్వంబు నివేదించి, యామంత్రణంబువడసి, యతిజవంబున నా యీ యాశ్రమంబునుజేరి యథాస్థితిగా భగవత్కాలక్షేపముం జేయుచుంటినని చెప్పి పిమ్మట కథ వచియింపనుపక్రమించె. 183

## —♦ వేల్పులవలన ♦—

. కాలము మంచిదై విరివిగాఁ దెగఁబండిన పంటపైరులే
చాలవు పొట్టకూటికయి ♦ స్వర్గమునందు వసించువారికిన్
నాలుగు రెండు మాసములు ♦ నాతముకూడ లభింపదాయెన్
గూలియు నాలి చేపడదు ♦ కొంచెమునై తము చెప్పనేటికిన్. 184

ఈతిబాధలు గల్గుచో ♦ నింకనేమి
కలదు? నల్లవో! గుర్రుక్కుడు ♦ గంజియైన
బోక్కుడన్నమైనను బుట్టఁ ♦ బోవదందు
నిట్టినాడికయందొక్క ♦ యేడునందు. 185

. వేసినపై రెల్ల ♦ మోసులెత్తకమున్నె
సంగోరు తినివేసె ♦ జట్టిమిడుత
ఏఁడాదిపొడవున ♦ నివతళింపఁగ భూమి
విడివడ్డ సాఁబాలు ♦ సుడిసిపోయె
ముకాకరుపంటలు ♦ ముక్కిపోవఁగ నిట్లు
పట్టెఁడు కలిమైనఁ ♦ బుట్టదయ్యె
వలిజుట్టఁబెట్టంగ ♦ వడిగండ్ల కడగండ్లఁ
గడుపు కక్కుర్తియుఁ ♦ గడవదయ్యెఁ

. బ్రజల కన్నపానీయముల్ ♦ వట్టిపోయెఁ
గంటికిని గూర్కు కఱవయ్యెఁ ♦ గాని కాల
మరుగుదేరంగఁ గటకటా! ♦ యమరపురిని
దుర్భరంబైన దుర్భిక్ష ♦ తొడరినపుడు. 186

ఁం. కాపులు పడిగాపులగుచుఁ
గూపెట్టుచు తేని కొలువు ♦ కూటముఁ జొరఁగా

నేపనిక్కై వచ్చితిరని
కాపులఁ బ్రశ్నింపఁ డెంత ♦ గామిడీ యతఁడో. 187

గీ. ఎత్తికోళ్ళకు కనికరం ♦ బెనయలేదు
మొత్తుకోళ్ళకు మది జాలిఁ ♦ బొందలేదు
వేడికోళ్ళకు దయ యుద్భ ♦ వింపలేదు
ముజ్జగంబుల దొర యెంత ♦ ములుచవాఁడొ. 188

గీ. పలుకరింపని దొరవంకఁ ♦ బాఱఁజూచి
మూతి బిగఁబట్టి లోలోన ♦ రోఁతపుట్ట
నాదరింపని ఱేని రా ♦ జ్యంబుఁ దొలఁగి
వలసపోవుటే మిగుల సం ♦ భావ్యమనుచు. 189

గీ. వేల్పుఱేని దివాణంబు ♦ విడచిపెట్టి
వెంటఁ దెఱగంటి మూఁకల ♦ బంటులపుడె
గుసగుసలువోయి యొకచోటఁ ♦ గూడి మాడి
పట్టుఁబట్టిరి యెటకేని ♦ వలసపోవ. 190

గీ. అంత దేవతానీకమ్ము ♦ నందుఁ గొన్ని
తెగ లయోనిజప్రభృతులు ♦ తెగువఁజేసి
యిళ్ళు వాకిళ్ళు తెగనమ్మి ♦ గొల్లుమనుచు
పనవియొకసారి నాకంబు ♦ వంకఁజూచి. 191

సీ. తరతరంబులనుండి ♦ తనివోవఁగాఁజేయు
సురనిచ్చు చెట్లను ♦ సురుగుటెట్లు ?
బెదరించి యందందు ♦ బెల్లించుకొనితెచ్చు
హవ్యకవ్యముల బో ♦ నాడుటెట్లు ?

మున్నాట యర్వాది ♦ ప్రొద్దుల ముఱిపించు
వెల్లాటకత్తెల ♦ వీడుటెట్లు ?
మందయానలతోడ ♦ మందాకిని మునింగి
విహరించుకోర్కెల ♦ విడచుటెట్లు ?

గీ. పండువెన్నెలమాపులఁ ♦ బాయుటెట్లు ?
గండుకోయిల పాటల ♦ గడచుటెట్లు ?
అనుచుఁ గన్నీటిజాలుతో ♦ వెనుకతిరిగి
వ్రేలుకాడెడి మోముతో ♦ వెడలనెంచి. 192

ఉ. మూటలుముల్లెలుం దలల ♦ మోపి భరంబునఁ దొట్రుపాటుతో
దోలుట దొడ్లనున్ వదలి ♦ త్రొక్కిసలాడుచు నందఱేకమై
బాటలఁబట్టి పేరలపు ♦ వాయఁగఁ బాటలుచొక్కి పాడుచున్
బూఁటలు రోజులున్ నడచి ♦ పోయిరి కొండల నేటవాలుగా. 193

గీ. అమరనదిదాఁటి ముదిగొండ ♦ నవతరించి
కొండఱిటునటు పరికించి ♦ కొట్టకొనకు
భరతవర్షంబు వీక్షించి ♦ పట్టుపవలె
మెట్టిరాంగిలేయులఁబోలెఁ ♦ బొట్టకొఱకు. 194

గీ. భరతవర్షంబుఁ జొరక య ♦ సురులయోని
జ ప్రముఖ దేవయోనులు ♦ క్షిప్రగతిని
పశ్చిమాశాభిముఖముగాఁ ♦ బైనమైరి
కొల్లగొట్టంగ దేశంబు ♦ కొల్లయనుచు. 195

గీ. సింధు గంగానదీపుణ్య ♦ జీవనములఁ
బూఁచికాచిన తరులతా ♦ పుంజములను

గలయఁ బరికింప మిఱుమిట్లు ♦ గొలుప నందె
నెలవు లేర్పఱచికొనంగ ♦ నిశ్చయించి. 196

చం. పరమబుభుక్షుచే నవసి ♦ భారతభూమిని జొచ్చి పిమ్మటన్
సురలను తొంటిపేర్విడచి ♦నూత్నసమాఖ్యను నార్యనామమున్
బిరిగొనువేడ్కఁదాల్చి పిరి ♦ వీకను మాని క్రమక్రమంబుగా
గురుతర కాయకష్టముల ♦ కుం దలలొగ్గుచుఁ గ్రీర్తికాములై. 197

సీ. చిదుగు కంపలనెల్లఁ ♦ బొదుపుగా నొకచోటఁ
బెచ్చుగాఁబెట్టి కా ♦ ర్చిచ్చుఁబెట్టి
పొడవుగాఁ బెరిఁగిన ♦ నిడుదచెట్టులనెల్ల
గొడ్డళ్ళచేఁ బడఁ ♦ గొట్టివైచి
ఎండకన్నెఱుఁగక ♦ యివతళించెడునేల
పై నున్న యీరముల్ ♦ పాయఁద్రోసి
గుట్టమెట్టలుగాఁగ ♦ బిట్టుగాఁబడియున్న
పలుగురాళ్ళన్నింటిఁ ♦ దొలఁగఁబుచ్చి

గీ. భరత భూమండలంబును ♦ వాసయోగ్య
మైనదానిగా నొనరించి ♦ యచ్చటచట
నార్యు లగ్రహారంబుల ♦ నవతరింపఁ
జేయ సమకట్టి యద్భుతా ♦ మేయశక్తి. 198

గీ. జాంగలముల లాంగలములఁ ♦ జక్కఁజేసి
యెక్కలిని మిక్కిలి వసించు ♦ నిక్కఁజేసి
యార్యకౌమారవర్గంబు ♦ కార్యనిరతిఁ
గాట్రగడ్డతోఁ బల్లెలఁ ♦ గట్టిరంత. 199

కం. చిరి తామర కొలనువలెన్
బరిమితి లేకుండ వారు ♦ వర్ధిలుచుండన్
సిరిసంపత్తులతోడన్
బెఱవారికిఁ గన్నుఁగుట్టై ♦ బెడిదంబగుచున్. 200

సీ. గండాడుక్రొప్పులుల్ ♦ గండరించెడిచోట
గోరాడు నేనుగుల్ ♦ గూడుచోట
బుసకొట్టు నాగముల్ ♦ మసకలాడెడిచోట
గర్జిల్లు సింహముల్ ♦ కవియుచోట
ఱంపిల్లి వృషభముల్ ♦ ఱంకె వైచెడిచోట
మంపిల్లి తోడేళ్ళు ♦ మరగుచోట
కారుదున్నలుకూడి ♦ కసవుమేసెడిచోట
కారుమబ్బులు తొంగి ♦ కలియుచోట

గీ. తెండికై వాళ్లైకంబులు ♦ తిరుగుచోట
వత్సములును బాలురును మ ♦ హోత్సవమునఁ
బందెములువైచికొని క్రేళ్ళు ♦ వారుచుండ
నూరువల్లెలు తలయెత్తె ♦ నొక్కటొకటి. 201

గీ. అంతకంతకు నీరీతి ♦ నార్యసమితి
వర్ధిలఁ గులము పెద్దలు ♦ భావిగతులఁ
బాయకట్టులఁ జర్చించి ♦ బందుకట్టి
గట్టుదిట్టముల్ చేయుట ♦ కర్జమనుచు. 202

కం. పాత్రులను బిలిచి బ్రహ్మ
క్షత్రియవైశ్యులని యార్య ♦ సంఘంబును వ

ర్ణత్రయముగ విభజించుచు
సూత్రించిరి ధర్మకోటి ♦ సూరులదయచే. 203

సీ. నిత్యనైమిత్తిక ♦ నియమంబులనుదీర్చి
భగవంతుఁ బూజింప ♦ బ్రాహ్మణులను
ఖడ్గధారలచేతఁ ♦ గంపకోటలఁగట్టి
కాపాడఁ బల్లెల ♦ క్షత్రియులను
వాణిజ్య గోపరి ♦ పాలన కృషులచే
బండారములనింప ♦ వైశ్యవరుల
నియమించి వేర్వేఱ ♦ నిర్దిష్ట కార్యముల్
జాగరూకతతోడ ♦ జరుపుచుండఁ

గీ. గూటియెద్దడిలేకుండఁ ♦ గొన్నినాళ్ళు
సకల సౌభాగ్యగరిమచే ♦ సాఁగ "మూఁడు
పూవు లారు కాయ"లనిన ♦ పోల్కినెగడెఁ
జూచువారికి నోడలెల్ల ♦ సొక్కుపుట్ట. 204

గీ. బ్రాహ్మణుండు వేద ♦ పాఠంబు సేయంగ
క్షత్రియుండు రిపులఁ ♦ జక్కఁబఱప
వైశ్యవరుఁడు కృషియు ♦ వాణిజ్యమును జేయ
నార్యసమితి యెసగె ♦ ననుదినంబు. 205

గీ. పుట్టి పెరుగుచున్న ♦ బొట్టియలకునెల్ల
నూత్నశౌర్యపటిమ ♦ నూరిపోసి
కుబుసమూడ్చినట్టి ♦ కోడెత్రాచులఁ జేసి
పెంచినారు కులము ♦ పెద్దలెల్ల. 206

గీ. మాంత్రికులు విప్రవరు లప్ర ♦ మత్తులగుచుఁ
జెడని తంత్రంబుఁ జక్కఁగా ♦ నడపుచుండఁ
జుట్టుప్రక్కల పాలమెల్లఁ ♦ జుట్టఁబెట్టి
కైవశముఁ జేసికొనినారు ♦ క్షత్రవరులు. 207

కం. దేశంబీవిధముగ నై
దేశిక వీరభటులకు న ♦ ధీనమయిన నా
క్రోశముతోఁ బరికించి స్వ
దేశజు లారాటపడుచు ♦ దికమకలగుచున్. 208

## —♦ ద్రావిడయోధుల మంతనము ♦—

గీ. రచ్చమాన్రనుక్రించ ♦ ద్రావిడమన్నీలు
రెడ్డిగములు వైచి ♦ గడ్డుదేరి
రెడ్డిగములఁ బిల్చి ♦ యొడ్డోలగంబుండి
మాటలాడిరిట్లు ♦ మంతనమున. 209

కం. వింటిమె వింతలు ? నిజముగఁ
గంటిమె యెపుడేని యిట్టి ♦ కార్యములఁ ? గూ
ర్చుంటిమె చేతులు ముడుచుక ?
బంటులమని ప్రల్లదీండ్రు ♦ పగ్గెలు కొట్టన్. 210

గీ. బొల్లిమొగముమీఁదను నిల్చి ♦ బొట్టుఁబెట్టి
రాలురప్పల కెల్లను ♦ గేలుమోడ్చి
గండ్రగోళంబుఁగావించు ♦ కల్లరీండ్ర
దౌష్ట్యమును మాన్పకుండుట ♦ ధర్మమగునె ? 211

కం. దేశము మనయది కాదో !
దేశోద్ధరణంబు భాగ ♦ ధేయము కాదో !!
దేశవినాశకులగు వై
దేశిక హాసనంబు మన య ♦ దృష్టము కాదో !!! 212

సీ. అవిసి తేనెలు చిల్కు ♦ నమృతకల్పములైన
పండ్లనిచ్చెడి వృక్ష ♦ పంక్తి గల్గి
తమయంతనే క్షీర ♦ ధారలు గురియించు
పాదుగులుండిన యాల ♦ కదుపు గల్గి
తావుల్ గుబుల్కొను ♦ పూవుదీవెల కప్ప
డంబుల పొదరిండ్ల ♦ డంబు గల్గి
తడిసి నాగేటికఱ్ఱు ♦ దాఁకకుండఁగఁ బండు
బలము గల్గిన మంచి ♦ పొలము గల్గి

గీ. యెల్లకాలంబు పోషించె ♦ నింతదనుక
"నడుగనిదె యన్నమును బెట్టు ♦ దమ్మ"యైన
ననెడి సామెత వ్యర్థమై ♦ చనఁగ నిట్టి
మాతృదేశంబు మనమెట్లు ♦ మఱవవచ్చు ? 213

ఉ. కూళలు రేఁగి యీకరణిఁ ♦ గూడని కార్యము లాచరించుచున్
బాలలు బాలురున్ బెదరి ♦ పాఱఁగ బొబ్బలు పెట్టిపెట్టి గ
గ్గోలొనరించి దేశమును ♦ గొద్దియొ గొప్పయొ యాక్రమింప నీ
పోలిక నూరకుంట మన ♦ బోంట్లకు ధర్మమె ? రాజకర్మమే? 214

గీ. నదురు బెదరులేని ♦ నాయంకులెందఱో
సొంత నాడుకొఱకు ♦ వంతదక్కి

వ్రేటుపడ్డపులుల ♦ విధముగాఁ బోరాడ
నేర్చువారుకలరు ♦ నిశ్చయముగ. 215

కం. ఇప్పుడె మనమెల్లరమును
జప్పుడుగాకుండ వైరి ♦ సైన్యముమీఁదన్
గుప్పించి దూఁకి పొడుచుట
తప్పని పని వేఱెలేదు ♦ ధర్మంబన్నన్. 216

గీ. అంపకోలలు పొదినుండి ♦ యవలఁబడెను
పదనుచురకత్తు లొరనుండి ♦ బయటఁబడెను
మన్ను మిన్నును గానక ♦ మన్నె దొరలు
సింగినాద మూఁదుచుఁ గూచి ♦ సేసి యపుడు. 217

ఉ. రక్తము వాఁగులై దెసలఁ ♦ రంయిని పారకమున్న క్రూరమై
సక్తములెల్ల రోదసపి ♦ నద్ధములై గనరాకమున్న యీ
దృక్తతి పోకమున్న మన ♦ దేశము ముష్కర శత్రుకోటికిన్
భుక్తమయానె ? యేమియయి ♦ పోయెను నీసుభటాలియంతయున్ ?

గీ. ఓసరిలకుండఁ బ్రాణంబు ♦ లొడ్డియైనఁ
బీన్గుపెంటలుగాకుండఁ ♦ బృథివియెల్ల
మనము స్వాధీనపఱతుమే ♦ మాతృధరను ?
ననినమాత్రాన సైనికు ♦ లదరిపడుచు. 219

వ. కోలాహలముఁజేయుచు, "శత్రులసదమదించుటొండెప్రాణంబులను
వీడుటొండె" సంభవించుననుచుఁ బంతంబులాడికొనుచుఁదమతమ
మనికిపట్టులకుంజని, సమధిక సమరోత్సాహంబునఁ గట్టాయితులై.

ఉ. పంబిన కోపవేగమున ♦ వైరుల యుక్కడగింప తీవ్ర రో
షంబున బారు టీఁటెలును ♦ జౌకులు కత్తికటారి పిండు వి
ల్లంబులుదాల్చి యాక్కమొగి ♦ నందఱు మచ్చరమూని సింహానా
దంబులు చేయుచున్ సమర ♦ ధాత్రికిఁ జేరఁగ గుంపు గుంపులై.

గీ. వింటికోపుమీఁద ♦ వీరరక్తముఁజల్లి
పలుకవాలునకును ♦ బలులువెట్టి
మూఁగ దేవరలకు ♦ మ్రొక్కుబడులుదీర్చి
పైనమైరి రిపుల ♦ బారిసమర. 222

కం. అంతకుమున్నే రిపు వృ
త్తాంతమెఱిఁగి యార్యులు బహు ♦ దర్పముతో ని
శ్చింతమెయిన్ సాయుధులై
పంతముతో వచ్చినారు ♦ బవరము సేయన్. 223

కం. ఒంటరులై సరిసరులై
బంటులు చెలరేఁగి యుభయ ♦ పక్షములందున్
గెంటింపఁబడుచు గెంటుచు
బంటింపక వారనేక ♦ భంగులఁ బోరన్. 224

ఉ. గండరగండలై పిఱికి ♦ కండ యూకించుక లేక చండదో
ర్దండగదాప్రహారముల ♦ దంటు సయింబడి పోరుచుండఁగా
నేండులు పూండులున్ గడచె ♦ నింతియ కాని జయంబుమాత్రమున్
రెండుకుదుళ్ళవారిని వ ♦ రింపకపోయె నిఁకేమిచెప్పెదన్. 225

గీ. అంత భటులెల్ల జర్జరి ♦ తాంగులగుచుఁ
గాందిశీకులై తాత్తాలి ♦ కంబుగాఁగ

గలను జాలించి రంతియే ♦ కాని పిదపఁ
బెనఁగులాటను క్షీణమైన ♦ పీడకైరి. 226

కం. ఓహరి సాహరి పెనఁగియు
మోహరములుదీర్చి యుద్ధ ♦ భూమి వడంకన్
బాహాబాహినిబోరియు
నోహటిలెను ద్రావిడ సుభ ♦ టోత్కరమెల్లన్. 227

కం. పేఁగిన ద్రావిడసైన్యము
బాగుగ వీక్షించి యార్య ♦ వాహినులెంతో
వేగమ వెన్నాడెను నీ
యాగముఁ బరికించి దేశ ♦ మంతయు బెదరన్. 228

కం. పిల్లలు ప్రొద్దెల్లఁగలసి
యల్లో నేరేళ్ళనాడి ♦ యరిగెడిభాతిన్
జెల్లాచెదరై ద్రావిడు
లల్లాడిరి చెట్టుకొక్క ♦ రై యడవులలో. 229

ఉ. ఒంజలిచేత ద్రావిడులు ♦ యుద్ధము మాని విషాదచిత్తులై
వింజముదాఁటి కారుటడ ♦ విన్ దలదాఁచుకొనంగఁ జొచ్చుచున్
సంజల దొంగదారులను ♦ జాటున మాటున దక్షిణాశకున్
గొంజక క్రొత్తనాడికల ♦ కుం జని నిల్చిరి యచ్చటచ్చటన్. 230

కం. చెంచులుమాత్రము వింజపు
టంచుల విడిపోవలేక ♦ యటనే తముఁ బో
షించుకొనుచు డాగిరయో !
పెంచిన దేశంబు విడచి ♦ పెట్టఁగఁ దలమే.? 231

గీ. మాన్యతరమైన దేశాభి ♦ మానగరిమ
పచ్చి నెత్తురుఁ ద్రావెడి ♦ పగఱనడుమ
నుసురులఱచేత నిడికొని ♦ మసలుచుండు
చెంచువారలఁజూచి గ్ర ♦ హించవలయు. 232

ఉ. నేఁడును వింధ్యపర్వతపు ♦ నెత్తములందునఁ జెంచువారు మ
ల్లాడుచుఁ గాననొందురు, ప్ర ♦ యత్నము లేకయె చింకిగుడ్డలున్
వాఁడి శరంబులున్ బలుక ♦ వాలును దాలిచి భీకరంబుగా
గూడెము వీడి, తేనియల ♦ కోసము చెట్టులనెక్కి డిగ్గుచున్. 233

—♦ శూద్రులు; శూద్రశబ్దవ్యుత్పత్తి. ♦—

ఉ. ద్రావిడయోధులీగతిఁ బ ♦ రాజితులై చన నార్యులై నికల్
త్రోవల నడ్డగించి పెఱ ♦ తోయమువారలనెల్లఁ బట్టి త
జ్జీవములన్ హరించుచు వి ♦ శృంఖలులై విహరించిరకటా!
కేవల దుష్టబుద్ధిఁ దమ ♦ కించి త్యజించి సమీకధర్మమున్. 234

గీ. పాఱఁబోతులుఁ బందలు ♦ బడుగువారు
బవరమున వికలాంగులై ♦ పడినవారు
చేతఁ బడఁబాయకట్టులఁ ♦ జేర్చి పెట్టి
రార్యు లానందరసమగ్ను ♦ లగుచుఁ బిదప. 235

కం. సందియమందక కుందక
యందుండిన భటులనెల్ల ♦ నావేశముతో
బందెలలోఁ బడఁగొట్టియుఁ
గుందింపఁగ మొదలుపెట్టి ♦ కుత్సితులగుచున్. 236

గీ. బాససీండ్రుగాఁ గొందఱ ♦ బానిసీండ్రు
గాఁగఁ గొందఱ నియమించి ♦ కాడుచేసి
కలుషితాజ్ఞాన గాఢాంధ ♦ కారమునను
ముంప యత్నముల్ చేసిరి ♦ తెంపుతోడ. 237

కం. కులపతియైన వసిష్ఠుఁడు
కలుకుచు శాత్రవులు గోడుఁ ♦ గుడుచుట చేతన్
దలపోసి పోసి యీ గతిఁ
బలికెను దనవారితోడ ♦ వజ్జరియగుచున్. 238

గీ. చేతఁబడినారు పగవారు ♦ చేతఁదక్కి
వారి జీవముల్ గొనుటొండె ♦ వదలుటొండె
వెట్టిపనియైన మెడకంటఁ ♦ గట్టుటొండె
మనము నిశ్చయించుట పాడి ♦ యనుచుఁ బలుక. 239

గీ. పడుచుమగవాండ్రు "తమచేతఁ ♦ బడినరిపుల
విడువ ధర్మంబుగాదం"చు ♦ నుడువుచుండఁ
దలలునెఱసిన మంత్రివా ♦ దులిటులనిరి
భావికాలగతులనెల్లఁ ♦ బారఁజూచి. 240

సీ. మనకగ్గమైరంచు ♦ మార్తుర పరికాండ్రఁ
దల కోసి వైచుచో ♦ దారుణముగఁ
బగతురింకను బటా ♦ పంచలై పోలేదు
మనపైకి రావచ్చు ♦ మాపా రేపా
మననిప్పు డొనరించు ♦ మారణకర్మంబు
విన్నవారొడలిపైఁ ♦ బ్రీతిఁదొరఁగి

దగదీరఁగ్రొన్నెత్తుఁ ♦ దెగఁద్రావు కత్తుల
వ్రేటులాడరె మన ♦ చేటుమూడ

గీ. వారు సామాన్యులా ? వీర ♦ భటులుకారె ?
మనమెఱుంగమే వారి సం ♦ హననశక్తి
మంత్రతంత్రంబులను బిల్కు ♦ మార్పవలయుఁ
గాని వేఱుమార్గము కోఱ ♦ గాదఁటన్న. 241

కం. అగునగుననుచు వసిష్ఠుఁడు
పగఱఁ బరిసిపుచ్చవలయు ♦ బహుతంత్రములన్
బిగిగలుగు రాజనీతిని
వెగటించు మఱొండు కార్య ♦ విధిచే ననుచున్. 242

ఉ. నూతనవైఖరిన్ మిగుల ♦ నూతనధర్మము లుగ్గడింపఁగా
నాతరి బ్రాహ్మణోత్తముల ♦ నందఱికిం బిలిపించి చెప్పఁగా
నాతత శేముషీ విభవ ♦ మచ్చుపడన్ దలలూఁచి వారలున్
గైతవబుద్ధిమాటుపడఁ ♦ గాఁ దెగవ్రాసిరి ధర్మసూత్రముల్. 243

కం. నల్లని ద్రావిడచర్మము
తెల్లని తమమేనుసోఁకఁ ♦ దెగమాయునటం
చుల్లరములాడి ద్రావిడ
వల్లభులనుగూడఁ దాఁక ♦ వలదనిరార్యుల్. 244

కం. తమజాతిలోనఁ గలిసినఁ
దమవర్ణము మాసిపోవుఁ ♦ దప్పకయనుచున్
దమకక ద్రావిడజనులను
దమజాతిని జేర్పరైరి ♦ తగవని యార్యుల్. 245

కం. ద్రావిడులలోనఁ బెద్దల
రావించి మఱియొక్కనాఁడు ♦ అచ్చుకుఁదగుమై
నీవిధము వసిష్ఠుఁడనియెఁ
దీవరమును మాటుపుచ్చి ♦ తీయనినుడులన్. 246

కం. మీకున్న యింటిపేరులు
కోకొల్ల వినుటకు సొంపుఁ ♦ గూర్పవు పైఁగా
మాకున్ జ్ఞాపకముండవు
మీకెత్తుము మంచిపేరు ♦ మేమొకటనుచున్. 247

గీ. పగఱ యింటివరవడంబు ♦ వలనఁ గల్గు
దైహికము మానసికమైన ♦ దారుణార్తి
బ్రుంగుచుండుటఁ దలపోసి ♦ గ్రొవ్వుచేత
శూద్రులను పేరుపెట్టిరి ♦ శుద్ధశఠులు. 248

ఉ. బొత్తిగఁదాత్మిలేక పార ♦ పాచ్చములెవ్వియు నూనలేక య
త్యుత్తమజాతి సంజనితు ♦ లుండిరి ద్రావిడసంఘమందు నాఁ
జిత్తమునందు నొక్కపుడు ♦ చింతిలకుండఁగ శూద్రులంచు దు
ర్వృత్తినిమగ్నులై వ్యవహ ♦ రించిరి దూరముఁజూడకుండఁగన్.

ఉ. మానవజాతియన్న యభి ♦ మానములేకసమానమైన దు
ర్మానమునూని ద్రావిడుల ♦ మానమునెల్ల హరించుకోర్కెమై
మానమునందు సుంత యను ♦ మానములేకవమానమున్ సదా
మానక హీనమానవ స ♦ మానముగాఁ జరియించిరార్యులున్. 250

గీ. ఎన్నిగతులను వీలౌనో ♦ యన్నిగతుల
మతముపేరిట దుస్తంత్ర ♦ మంత్రములను

బ్రధితమూఢులంజేసిరి ♦ ద్రావిడులను
వినుము వివరింతు నవియెల్ల ♦ విశదముగను. 251

కం. తిరుమంత్రముఁ జెప్పెదమని
తిరుమంత్రముఁ జెప్పినారు ♦ తిన్నగఁ జెవిలో
ధరణీసురులకు మ్రొక్కినఁ
బరమపదము వచ్చునంచుఁ ♦ బరలోకమునన్. 252

చం. చదువులు నేర్చుచో మిగుల ♦ జ్ఞానముకల్గి వివేచనంబునన్
గదురను దాన నయ్యదియె ♦ కల్గినఁ దాము వచించు నీతి సం
పద తలకెక్కఁ బోదనుచు ♦ బ్రాహ్మణవర్యులు ద్రావిడావళిన్
జదువఁగరాదటంచు మఱి ♦ శాస్త్రములన్ లిఖియించిరెన్నియో.

గీ. చిఱుతనాఁటనుండియును సం ♦ స్కృతముఁ జదివి
నంతఁ దమగుట్టు బయలౌ న ♦ టంచు నెంచి
"చదువరాద"ని చెప్పిరి ♦ సంస్కృతంబు
నదియె పంచాక్షరీమంత్ర ♦ మయ్యెఁదుదకు. 254

గీ. అన్యులెవరేని సేయరీ ♦ యాగడంబు
నేది యిట్టిదికలదె సృ ♦ ష్ట్యాదినుండి ?
భాషఁగఱచుటకొక్క స్వ ♦ త్వంబువలెనె ?
చదువు జిజ్ఞాసకల్గినఁ ♦ జదువరాదొ ! 255

గీ. "నీతిశాస్త్రంబులఁ బఠించి ♦ నిగ్గుఁదీసి
మేముచెప్ప మీరాలింప ♦ మేలుకల్గుఁ
జదువ నష్టకష్టంబులు ♦ సంభవించు"
ననుచు మాన్పించిరట్టి వి ♦ ద్యానురక్తి. 256

కం. ద్రావిడకన్యల నార్యులు
వావిరి, చెఱపట్టి ధర్మ ♦ పద్ధతియయ్యెన్
గేవల మార్యులకన్నెల
ద్రావిడులు వివాహమాడఁ ♦ దప్పైపోయెన్. 257

గీ. సాఁగుచుండె నేఁడిట్టి యా ♦ చారమింకఁ
గేరళమునందు మిగులఁ గే ♦ కిసలతోడ
వెక్కసంబుగ నం బూద్రి ♦ విప్రులందు
ననుచితంబన్న వారొక్క ♦ రైన లేరు. 258

గీ. ఇచ్చి పుచ్చుకొనుటకల్గె ♦ నేని తుల్య
భావమేర్పడునుమ్మిరు ♦ వాఁగులందు
ననుచు నీయ మానుచుఁ బుచ్చు ♦ కొనుటయాకశె
మహితధర్మమనిరి నేఁటి ♦ మాధ్వులట్లు. 259

గీ. గుడులలోనికిఁ బోవుటఁ ♦ కూడదనిరి
బడులలోనికిఁ బోవుట ♦ పాపమనిరి
మడులఁ గట్టుకొను టధర్మ ♦ మార్గమనిరి
చటుల దుస్తంత్ర వైదగ్ధ్య ♦ సారమార! 260

గీ. ప్రజల న పలపింపఁగఁ గైత ♦ వంబుచేత
స్మృతుల వ్రాయించినారు పం ♦ డితులచేత
ద్రావిడులు మ్లేచ్ఛజాతివా ♦ రలని; కలదె
పాపపరిహార మిటువంటి ♦ వంచకులకు ? 261

కం. చింతాలేశములేకయె
యంతరికరణప్రవృత్తి ♦ నావలనిడుచున్

సంతోషముతోఁ దెగఁబడి
యెంతెంతలుచేసినార ♦ లేమివచింతున్ ? 262

ఉ. ఈవగఁ గుత్సితాత్ములయి ♦ యెంతయు ద్రావిడ మానసంబులన్
నోవఁగఁజేసి యార్యులు మ ♦ నోరథసిద్ధిని బొంద లేక తా
మేవగనేని తంత్రము వ ♦ హించుచు వారల స్థూల దేహముల్
బోవఁగఁజేయఁగా మనసు ♦ పుట్టినఁ బట్టనిగట్టి కిన్కతో. 263

ఉ. ఆర్యనవోఢలంగాని య ♦ నార్యులు పెండిలియాడ వర్ణసాం
కర్యముకల్గి యున్నతి గ ♦ కావికలౌనని చూరదృష్టిచే
నార్యసభాపతుల్ స్మృతుల ♦ యందున వ్రాసిరి ద్రావిడాళి త
త్కార్యమొనర్చినన్ గఠిన ♦ దండనలం బొరిపుత్తుమంచొగిన్. 264

ఉ. ఒక్కయధర్మమున్ సలుప ♦ కుండఁ బరార్తిని గోరకుండఁ గొం
డొక్కవిధంబునన్ జెమట ♦ యోడ్చి ధనంబును గూడఁబెట్ట నా
ఒక్కము ద్రావిడప్రజకు ♦ మ్రుచ్చిలియో బలవంతపెట్టియో
దక్కకయుండఁజేయుటయె ♦ ధర్మమటంచు వచించి రార్యులున్.

ఉ. అంగద చిచ్చునార్చుకొన ♦ నైన ననార్యులు పట్టెఁడేనియున్
బొంగలి ముట్టఁగూడ దొక ♦ పూటయుఁ జక్కని బట్టకట్ట రా
దెంగిలికూడు సాపడియె ♦ యెప్పుడు తప్పక వెట్టిఁ జేయుచున్;
గింగిరిపాతఁ గట్టుకొని ♦ కెట్టుటె ధర్మమటందు రార్యులున్. 266

ఉ. జాత్యభిమాన దుర్విషయ ♦ సక్తమనంబునఁ గ్రూరకర్ములై
సత్యము ధర్మమున్ వదలి ♦ శత్రులరాయుటె కర్జమంచుఁ బా
తిత్యము మూటఁగట్టికొని ♦ త్రిక్కక యార్యులు మంత్రతంత్రదౌ
ర్గత్యనిమగ్నులై తలప ♦ రానివి కానివిచేసి రెన్నియో! 267

మ. కొమరుంబ్రాయపు కండకావరమునన్ ♦ గోవాండ్రు దుర్ధర్షులై
భ్రమచే ద్రావిడకన్యకానివహ లా ♦ వణ్యంబునంజొక్కి డం
బముతోడన్ జెఱపట్టినన్ స్మృతులహో! ♦ పల్లెత్తుమాటైన ధ
ర్మముకాదంచును జెప్పనేరవుకదా! ♦ మర్యాదబద్ధంబులై. 268

ఉ. ఎల్లర దొడ్డపెంట భుజి ♦ యించెడి జంతువులెన్నియేని న
ట్టిల్లునుజొచ్చుచున్న నెవ ♦ రేమనరార్యులు, కాని జంకుతో
మెల్లఁగ ద్రావిడుల్ గడప ♦ మెట్టినమాత్ర కషాయతాడ్యులై
గొల్లునఁ దిట్టిపోసెదరు ♦ కూడదటంచు వచించునే స్మృతుల్?269

సీ. కోయ నయితికాని ♦ తీయ మామిడిపండ్లఁ
జేతికందిచ్చెడి ♦ చెట్లనడుమ
జడివానకైనను ♦ దడియకుండఁగనుంచు
ముండ్లుగల్గని పొద ♦ రిండ్లనడుమ
మోరలుపైకెత్తి ♦ పుల్లావుపెయ్యలు
క్రేళ్ళువారెడి పచ్చి ♦ బీళ్ళనడుమ
ఎండకారుననైన ♦ నెండిపోవని తేట
కొండవ్రంతలకొండ ♦ కోననడుమ

గీ. విరులకొ్రందావిఁ జిల్కు ప ♦ య్యెరలుగోృలఁ
బాఱుటాకులపాక లే ♦ ర్పఱచికొనుచుఁ
నందుఁ దలదాఁచికొను ద్రావి ♦ డాళినెల్ల
వానరులటంచు నార్యులు ♦ వదరినారు. 270

గీ. గడుసు రాయబారములెట్లు ♦ నడపఁగలరు ?
కడలి కానకట్టలనెట్లు ♦ కట్టఁగలరు ?

కానెపని నేర్చి యింగ్లీట్టు ♦ కట్టఁగలరు ?
వానరులెయైన ద్రావిడ ♦ ప్రజలు చెపుమ. 271

గీ. అగ్నిసాక్షి ప్రమాణంబు ♦ లాచరించి
వేర్పడచి పరుల్ తప్పఁ జూ ♦ పింపరాని
రీతిగా నెట్టువారు వ ♦ ర్తింపఁగలరు ?
వానరులెయైన ద్రావిడ ♦ ప్రజలు చెపుమ. 272

గీ. ఎదురు చెప్పఁగ నేర్చువా ♦ రెదుటలేమి
బెదరు నదురు లేకుండ ద్రా ♦ విడులఁగూర్చి
నీచ వాక్యంబులను వ్రాయ ♦ నేర్చినారు
బడుగు పెద్దలు గంటంబు ♦ పదనుచెడఁగ. 273

ఉ. కారియలందఁగాఁ బురుష ♦ కారము వ్యర్థమయైన ధైర్యముర్
జారఁగనీక ద్రావిడులు ♦ సాధుమృగంబులపోల్కి నెట్టి ధి
క్కారమునైన నెట్టి యప ♦ కారమునైన సహించి నీరసా
కారముతోడ నుండిరి వి ♦ కారములేకిటు లుత్తరంబునన్. 274

కం. భగ్నమనోరథులై యు
ద్విగ్న మనస్కులయి ద్రవిడ ♦ వీరవరేణ్యుల్
భుగ్నులయి దాస్యపంకని
మగ్నులగుచు నుండిరి యవ ♦ మానక్షుములై. 275

గీ. మంచికాలంబునకు వేచి ♦ పొంచి పొంచి
యార్య మందిరంబులయందు ♦ నణఁగి మణఁగి
చివికిపోయిన మనసుతో ♦ నవసి నవసి
యుత్తరాదిని ద్రావిడు ♦ లున్నయంత. 276

ఉ. దక్షిణభూమికిం జనిన ♦ ద్రావిడు లద్భుతశక్తిమంతులై
దీక్షవహించి దానిని స్వ ♦ దేశముగాఁ దలపోసి దక్షులై
యాక్షితి నిండ్లుగట్టుకొని ♦ యందె వసించి క్రమక్రమంబుగా
నక్షయమైన వైభవము ♦ నందిరి వందురుమాని యందఱున్. 277

గీ. పంటకాల్వలయ్యెను గొండ ♦ వాగులెల్లఁ
బంటపొలములయ్యెను జౌటి ♦ పడియలెల్లఁ
బంటపైరులు తలయెత్తె ♦ గంటలోనఁ
బంటకాపు చల్లనిచేయి ♦ పడినమాత్ర. 278

కం. దక్షిణ దిగ్భాగమున సు
శిక్షితులై ద్రావిడకుల ♦ శేఖరతతి ధ
ర్మక్షయ మెది లేకుండఁగ
రక్షింపుచు బీదసాద ♦ రైతులనెల్లన్. 279

ఉ. రాజ్యములం గడించి సమ ♦ రస్థలి శత్రులఁ బిల్లువార్చిత
ద్రాజ్యములన్ హరించకయె ♦ రాజ్యములన్ దొలిరాజులేల సా
మ్రాజ్యపదాధి రూఢులయి ♦ ద్రావిడ భూపతివర్గ మెంతయో
ప్రాజ్యముగాఁగ నేలి జన ♦ రంజనఁజేసెను దక్షిణంబునన్. 280

ఉ. బావము బంతిపెట్టి రిపు ♦ భూభుజ సంతతికిన్ సరస్వతీ
దేవికి నాట్యరంగముగ ♦ దేశమునుం బొనరించి లక్ష్మికిన్
స్థావరమొక్కటేర్పఱచి ♦ చక్కఁగ సర్వకకుబ్వికీర్ణతే
జోవిభవంబుచేతఁ బరి ♦ శుద్ధులు సిద్ధులునైరి భూవరుల్. 281

ఉ. భారతయుద్ధమందుఁ గురు ♦ పాండవసైన్యము రాజ్యకాంక్షచేఁ
బోరఁగ నిల్వఁగా సమర ♦ భూమి పరాజిత వైరివీర వ్ర

ధీరమణుండు పాండ్యుఁడతి ♦ ధీరుఁడు ద్రావిడభూమి భర్త శూ
రారికులంబునెల్లఁ దెగ ♦ టార్చఁడె ధర్మజ పక్షపాతియై. 282

సీ. వింధ్యదక్షిణభాగ ♦ విశ్వంభరను నొక్క
గొడుగుక్రిందికిఁదెచ్చి ♦ విడచినారు
కాకిచేఁ గబురంపి ♦ కప్పముల్ దెప్పించి
కొని వైరి కభయంబుఁ ♦ గూర్చినారు
దానధర్మశ్రేణి ♦ యూనంబుగాకుండ
బండారముల వెల్తి ♦ పఱచినారు
దండెత్తివచ్చిన ♦ మండలేశులనెల్లఁ
బారిమేసెడిదాఁకఁ ♦ బొడిచినారు

గీ. సరిగఁ బాలించి దుష్టశి ♦ క్షణము శిష్ట
రక్షణముఁజేసిరి ప్రజాను ♦ రంజకముగ
రాజమాత్రులే ద్రావిడ ♦ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ ♦ నిలయులైరి. 283

సీ. క్రమముగా వంశ పా ♦ రంపర్యముగవచ్చు
నాచారములను గా ♦ పాడినారు
ఉత్పన్నదశఁబొంద ♦ కుండ నెల్లప్పుడు
శృంగారకళలఁ బో ♦ షించినారు
కాటకంబులనెల్ల ♦ బూటకంబులుచేసి
సీమలన్నింటి ర ♦ క్షించినారు
దొంగదొద్దడికాండ్రఁ ♦ దూలించి రాష్ట్రంబు
లెద్దడిలేకుండ ♦ దిద్దినారు

గీ. ఆలగోలును గగ్గోలు ♦ బాలగోలు
కంటఁబడకుండ భూములఁ ♦ గాచినారు
రాజమాత్రులే ద్రావిడ ♦ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ ♦ నిలయులైరి. 284

సీ. అన్నమో రామచంద్రా! యంచు నారాట
పడి యంగలార్చెడి ♦ వారులేరు
చినిఁగిపోయిన చీర ♦ చెఱఁగొక్కటియులేక
ప్రాతకై యర్థించు ♦ వారులేరు
దినవెచ్చమునకునై ♦ దేవులాడుచును గ
వ్వయుఁగూడ యాచించు ♦ వారులేరు
చేసాచి యడిగిన ♦ నీలేదు పొమ్మంచు
బదరించి మాటాడు ♦ వారులేరు

గీ. ద్రవిడరాష్ట్రములందెల్ల ♦ నవిటి చవిటి
గాని గుడ్డివారొకరైనఁ ♦ గానరారు
రాజమాత్రులే ద్రావిడ ♦ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ ♦ నిలయులైరి. 285

గీ. గుడులఁ గట్టించి గోపుర ♦ కోటితోడ
మంచి మడిమాన్యములు సమ ♦ ర్పించి యధిక
దైవభక్తిఁ జూపించిరి ♦ దేవళముల
ద్రవిణమంతయు వెచ్చించి ♦ ద్రవిడనృపులు. 286

గీ. బాటసారులు నిలువంగ ♦ బాటకడల
వేసి పెంచిన తోఁటలు ♦ విసుగులేక

నీడనిచ్చుచునున్నవి ♦ నేఁడుకూడ
"వనము తోఁటలు" దక్షిణా ♦ పథమునందు. 287

ఉ. కాలవశంబునన్ ద్రవిడ ♦ ఖండము సర్వము ఛిన్నభిన్నమై
వ్రీలిన భిన్నరాష్ట్రములు ♦ భిన్నకులంబులు నుద్భవించెఁ ద
త్కాలమునన్ బురాతన స ♦ మున్నతి కోల్పడిపోయి పిమ్మటన్
జాలఁ గృశించెఁ గందువడె ♦ శాత్రవులుం దలలెత్త వెండియున్.

గీ. అబ్బురపు కాలవైపరీ ♦ త్యంబుచేత
రాష్ట్రములు చీలిపోయిన ♦ రాజులెల్లఁ
జెదరి నలుదిక్కులకు నేగి ♦ చిన్నచిన్న
సీమలార్జించి దొరలైరి ♦ నేఁగిలేక. 289

వ. దేశకాల పాత్రంబులవలనఁ గల్గిన పెక్కు మార్పులచే నాయా సీమలకు నేగిన ద్రావిడులు, నూతనాచారంబులు పట్టువడుటచే భిన్ననామరూపంబులం దాల్చి విజృంభించి, పదంపడి దక్షిణాపథమును మరల దక్కోలుఁజేసికొని, వివిధ రాజవంశంబుల పేరిట, నిష్కంటకంబుగా మహావైభవముతోఁ బరిపాలించిరి. కాలానురూపంబునఁ గల్గిన యీ పరిణామదశను నానుపూర్వికగ వర్ణించుట సుకరంబుగాదయినను, నా నేర్చిన కొలఁది పెద్దలవలన నెఱింగిన కొలఁది నెఱింగింతు నాలింపుము. ద్రావిడులు విజ్జోడై తమిళులు, తెలుఁగులు, కన్నడులు, మలయాళులు మొదలగు జాతులుగఁ జీలి, దక్షిణాపథంబు నాల్గు చెఱగుల నాక్రమించి, వెవ్వేరు నాగరికతయు భాషయుఁ బ్రతిభయుఁగలుగఁ గట్టుమాఱఁ జిరకాలం బరిష్టంబులేకుండ నేలుచుండ. 290

ఉ. ఐక్యముతోడఁ బంచజను ♦ లందఱు హాయిగనుండఁ జోళ చా
ళుక్యముఖాది భూమిపతు ♦ లున్ భువినేలిరి కొంతకాలమే

జాడ్యముకల్గనీక గుణ ♦ శోభితులై నయపక్షపాతికిన్
శక్యముకాని యట్టిపని ♦ సంభవమాయె జగత్త్రయంబునన్. 291

గీ. వారు కాలగోచరులైరి ♦ వారిపిదప
దేశ మల్లకల్లోలమై ♦ దిక్కులేమిఁ
గాలుచీకట్లు దిశలెల్లఁ ♦ గ్రమ్మికొనఁగఁ
బ్రజలు కళవళించిరుపద్ర ♦ వముల చేత. 292

గీ. తమిళ కేరళ తులువ రా ♦ ష్ట్రముల పూర్వ
పుణ్య పరిపాకమునఁజేసి ♦ పోసరించి
రచట నాయర్లు వెళ్ళాలు ♦ నతులశౌర్య
విదితకీర్తి భాసితులైన ♦ మొదలియార్లు. 293

గీ. తెలుఁగు దేశంబునందు దే ♦ దీప్యమాన
శక్తి రాజ్యంబుఁజేసిరి ♦ సారభుజులు
వెలమ మన్నీలు రెడ్డి హం ♦ వీరవరులు
కాపు సరదార్లు నాయకుల్ ♦ కమ్మదొరలు. 294

సీ. విక్రమావష్టంభ ♦ విభవాతిరేకులై
విదళించి కొట్టిరి ♦ వెలమదొరలు
సమర శౌర్యాటోప ♦ చండ ప్రచండులై
క్రవ్వించి నెట్టిరి ♦ కమ్మదొరలు
నిర్ణిద్రదోస్సార ♦ నిర్భిన్న వైరులై
రెట్టించి మెట్టిరి ♦ రెడ్డిదొరలు
వైరి భీకర ఖడ్గ ♦ పాండితీదక్షులై
కదియించి దట్టిరి ♦ కాపుదొరలు

గీ. శాత్రవానీకమీరీతి ♦ సమసిపోవ
దుర్భరావగ్రహ విపత్తి ♦ తొలఁగిపోవఁ
బ్రజలు బ్రదికిరి తస్కర ♦ భయములేక
తెలుఁగు దొరలేలు మాగాని ♦ పొలములందు. 295

గీ. వర్తమానంబుననుఁగూడఁ ♦ గీర్తిధనులు
వెల్గుచున్నారు పైవారు ♦ తెల్గు దేశ
మందుఁ బెట్టి పోషించెడు ♦ నట్టిశక్తి
నంగరంగ వైభవముల ♦ నంగవించి. 296

గీ. ఒక్కగతి పులి మేకయు ♦ నొక్కతేవు
నందు నీరుఁ ద్రావెడునట్టు ♦ లధికశక్తి
న్యాయభావంబుతో దక్షి ♦ ణాపథంబు
నెల్ల ద్రావిడరాజన్యు ♦ లేలుచుండ. 297

గీ. ఉత్తరంబున నార్యులు ♦ ద్వ్యాప్తిసపుడు
చతురుపాయంబులఁ బ్రయోగ ♦ చతురులగుచు
శత్రుకాండీరులనునెల్ల ♦ సదమదించి
దక్షిణాపథమ్ము జయింపఁ ♦ దలఁచి తలఁచి. 298

గీ. సర్వతంత్ర స్వతంత్రుండు ♦ శ్రద్ధవానుఁ
డింగితజ్ఞుండు వేద వే ♦ దాంగవేది
యగు నగస్త్యుని బిలిపించి ♦ యప్పడపుడె
చెప్పిరిటు పల్కు నయగార ♦ మొప్పచుండ. 299

ఉ. తెక్కలి నిన్న మొన్న పర ♦ దేశమునుండి బిరానవచ్చి నా
మెక్కడఁజూచినన్ రిపుల ♦ దే పనిగా మనచుట్టు మూఁగి తా

ముక్కడగింపనుండి రెటు ♦ లో యాకదారిని నుత్తరాదినిఁ
గక్కసపెట్టి వైరులను ♦ గాపురముంటిమి కత్తిబల్మిచే. 300

కం. మనచే నోడింపఁబడిన
మనవైరులు దక్షిణమున ♦ మసలుచు నుండన్
మనకబ్బఁగలదె క్షేమము
మనఁగలమే చిక్కులేక ♦ మనమిచ్చోటన్. 301

గీ. శత్రుపరిశేష మెటువంటి ♦ సాహసునకుఁ
బ్రాణహానికరంబని ♦ రాజనీతి
కోవిదులు పల్కుచుందురు ♦ గునియకుండఁ
గాన మనమది పాటింపఁ ♦ గర్జమౌను. 302

చం. కతిపయ శిష్యులుంగొలువఁ ♦ గాఁ బయనంబయి యిప్డె వింధ్యప
ర్వత వనభూములంగడచి ♦ ద్రావిడదేశముఁజొచ్చి యచ్చటన్
బ్రతివసథంబునన్ విడిసి ♦ వారలకుం దలలోని నాల్కవై
మతమును బోధసేయు మిష ♦ మర్మముతోనటియించి పిమ్మటన్.

కం. భేదోపాయము చేతన్
భేదముపుట్టించి మిగుల ♦ భేదజ్ఞుఁడవై
వాదులతో మూఢలతోఁ
గాదనకొప్పించి తీర్చఁ ♦ గదె మన పనులన్. 304

గీ. ప్రజ్ఞ చేత దివ్యమగు ను ♦ పజ్ఞ చేత
లోకవృత్తం బెఱుఁగఁజాలు ♦ మీకు ధర్మ
ములుపదేశించు పాటివా ♦ రలము కాము
గాని చెప్పుచుంటిమి యని ♦ గ్మైన వినుఁడు. 305

గీ. చెరసిమాటాడఁ బోకుమీ ♦ పరులతోడ
నరసిసాగింపు తంత్రమా ♦ దరముతోడ
మరిసి కిటుకేమి చెప్పకు ♦ మొరులతోడ
నిరిసిరైనఁ బట్టినపట్టు ♦ నెల్లఁదీర్పు. 306

గీ. దేశకాలపాత్రంబుల ♦ దీర్ఘదృష్టి
నఖముఖంబులఁ బరికించి ♦ నిఖిలగతుల
విప్రకారంబుఁ దగనెంచి ♦ వేచియుండి
మంచికాలంబున విరోధి ♦ నొంచవలయు. 307

ఉ. ఎట్టులనేని సంఘహిత ♦ మే పరమార్థమటంచు నెంచి యి
ప్పట్టున గట్టిపట్టుదలఁ ♦ బైకొని మేలొనరింపు దాన నీ
పుట్టువు సార్థకంబగును ♦ బొద్దులుపుచ్చఁగవచ్చు హాయిగా
రట్టడిలేని రాష్ట్రముల ♦ ఱంపిలుచుండఁగఁ జిన్నపాపలున్. 308

వ. అని యీరీతిఁ జదువు సాములు నేర్చిన కులము సాములు, నచ్చఁ జెప్పి, మున్నడి దీవించి, యగస్త్యునిఁ బ్రయాణోన్ముఖుం జేయ నతండును వల్లెయని, నైళమ శిష్యపరివృతుండై, యత్యుత్సాహంబునఁ బయనంబై, వింధ్యపర్వతంబు నిర్గమించి, తద్దక్షిణదిశాభాగ పరివ్యాప్తంబగు కీకారణ్యంబుఁ బ్రవేశించి, వాసయోగ్యంబులగు పొలముల నెమకి, జలతృణకాష్ఠ ఫలవృక్ష సమృద్ధంబగు ప్రదేశంబులయందు మునిపల్లెలుగట్టుకొని, జన్నితోల్లుపట్టుల నేర్పఱచికొని, పెద్దరులగు శిష్యులంగూర్చికొని, ద్రావిడ జనపదంబులకుఁబంపి, విచ్చలవిడి వేదాంతంబు బోధింపించి, పూర్వాచారంబులఁ దెగడి, వెగటుపుట్టించి, తర్కపాండితీ మహిమంబు వెలయ, వితండవాదంబుఁగావించి, పూర్వాపరసందర్భముల మఱి

పించి, ద్రావిడసంఘంబునుండి జాతిద్రోహుల సృష్టించి, పెర యించి, కొంతదనుక, సఫలీకృత మనోరథుఁడై, యుప్పొంగుచుఁ గులుకుచుఁ గొండొకనాఁడు, తమకించి యిట్లు విచారింప దొడంగెను "స్వార్థపరులై, సంఘద్రోహమునకు వెఱవక, జాతి వైరంబు దిగఁద్రావి, విడివడి, యార్యసంఘదాసానుదాసులై జోహారులు చేయుచున్న ద్రావిడమాత్రులకు, నైహికవాంఛా సంతృప్తిఁజేయంజాలు విడిముడి యిచ్చినంగాని, కులగౌరవంబు నొసంగినఁగాని, యార్యసంసర్గంబు నైహికాముష్మిక ఫలదాయకం బని, విశ్వాసంబుఁ గల్పించినంగాని, వీరార్యవిజృంభణంబునకుఁ గొఱముట్టులు కానేరరు, కావునఁ దత్క్షణమ సమాధానపఱచుట సమీచీనంబని, నిర్ధారించి. 309

గీ. కులము లేనట్టివారికిఁ ♦ గులమునిచ్చి
పేరు లేనట్టివారికిఁ ♦ బేరునిచ్చి
సొమ్ము లేనట్టివారికి ♦ సొమ్ములిచ్చి
పనినిసాగించెను గుల నా ♦ పకులఁజేసి. 310

ఉ. ద్రావిడసంఘముఁ వదలి ♦ తక్కుచు వచ్చినవారి నెల్లరన్
బ్రోవుగఁజేసి మాట పయి ♦ పూత మెఱుంగులుదోప నార్య ధ
ర్మావళి నాచరించు నెడ ♦ నైహికసౌఖ్యములబ్బుఁ బిమ్మటన్
దేవపదంబుఁబొంది కడ ♦ తేరఁగవచ్చునటంచుఁ జెప్పుచున్.311

సీ. కులగోత్రములఁ గొన్ని ♦ క్రొత్తగాఁ బుట్టించి
విప్రులటంచును ♦ పేరువెట్టి
తను తాత ముత్తాత ♦ తండ్రులు వీరికి
గోత్రపురుషులంచు ♦ గొణిగిచెప్పి

తమతో సమాన ప ♦ దవి నిచ్చితిమటంచు
కపటగౌరవమింత ♦ గానుపించి
క్రమముగా భోజన ♦ ప్రతిభోజనంబుల
నిప్పించి మర్యాద ♦ నేర్పఱించి

గీ. ద్రావిడుల పల్లెలకుఁబోయి ♦ తప్పకుండ
పైసి విడనాడి వారితో ♦ బాసలాడి
మనకుఁ గింకరులనుజేయుఁ ♦ డనుచుఁదెల్పి
తెలివితేటలతోఁ బని ♦ దీర్పుఁడనుచు. 312

వ. అగ స్త్య సంయమీంద్రుండు సమాధాన వాక్యంబులఁ గార్యగతి నిరూపించి చెప్ప, యుగవల్లబ్ధ గౌరవ సంజాత సంరంభంబున నగ స్త్యప్రశిష్యులంగూడి యభినవబ్రాహ్మణులు చెలరేఁగి ప్రవ ర్తించి కొంతకాలంబుచనుడు ద్రావిడుల పాయకట్టులకుంజని.

సీ. "గంగ"గుడులు మాని ♦ కట్టుఁడీమీరు సీ
తారాములకు మేలి ♦ దద్దళములు
"పోతురాజా"దుల ♦ ముందు చిందులుమాని
పట్టుఁడీ భద్రుని ♦ పళ్ళెరంబు
"గొంతెమ్మ"దేవర ♦ కొలుపుమాని కొలువుఁ
డీ బ్రహ్మవిష్ణు మ ♦ హేశ్వరులను
మాత "పోలేరమ్మ" ♦ జాతరలనుమాని
సలుపుఁడీ బలులతో ♦ జన్నములను

గీ. గొఱ్ఱెలను మేకలను గొంతుఁ ♦ గోయమాని
గొంతుఁగోయుఁడీ గోవులన్ ♦ గుఱ్ఱములను

సంశయింపంగ మీకేల ♦ సత్యమిదిగో !
చచ్చిపోయినపిదప మో ♦ క్షంబువచ్చు. 314

గీ. జంటితేనె పూఁదేనియల్ ♦ జుట్టమాని
జుట్టుఁడీ మీరు కడుపాఱ ♦ సోమరసము
నప్సరసి కామినీ మధు ♦ రాధరమ్ముఁ
బానమునుజేయు యోగ్యత ♦ పట్టఁగలదు. 315

ఉ. అబ్బురపాటు పాటిలఁగ ♦ నందఱు నీగతివేడబంబుతో
నిబ్బరమైన పట్టుదల ♦ నెక్కొన నచ్చఁగఁజెప్పి మైకముల్
బ్రబ్బఁగఁజేసి ద్రావిడుల ♦ వంచనఁజేయుచు నార్యకింకరుల్
దబ్బరలాడియాడి తమ ♦ దారికిఁ ద్రిప్పిరి కొంతమందినిన్. 316

వ. పిమ్మట నార్యకింకరు లుపజాపకులై పులమరించి నిక్కి నీల్గుచు విఱ్ఱవీగుచుఁ గ్రిందుమీదెఱుంగక, స్వజాతిని ధిక్కరించి, స్వజాతీయుల మూఢులని తలపోయసాఁగి క్రమక్రమంబుగా. 317

సీ. మాతృ భాషాభిమానంబు ♦ మఱచిపోయి
యన్యభాషయనెడి బైసి ♦ మైనలేక
సంస్కృతంబును శ్రద్ధగాఁ ♦ జదువసాఁగి
యీసడించివైచిరి సొంత ♦ బాస నకట ! 318

కం. ప్రాచీనాచారములు స
మీచీనముగాదటంచు ♦ మిక్కిలి కినుకన్
వాచాలత్వముతోఁ బూ
ర్వాచారంబులఁ ద్యజించి ♦ రార్యానుచరుల్. 319

గీ. భేదభావంబు లీరీతి ♦ విస్తరించి
యార్యకింకరు లధిక గ ♦ ర్వాఢ్యులగుచు
మచ్చరంబంతకంతకుఁ ♦ హెచ్చు పెరుఁగ
నుద్దవిడి వేరుశాఖలై ♦ యుండి పిదప. 320

గీ. ద్రావిడ ప్రజావళియెల్లఁ ♦ దమకుఁ గైవ
శంబు గాకపోయెనను క్రో ♦ ధంబుచేతఁ
గలియుగంబునఁ బరికింపఁ ♦ గలవు రెండె
వర్ణములటంచు నార్యులు ♦ నిర్ణయించి. 321

గీ. బ్రాహ్మణులును శూద్రులును మా ♦ త్రంబెకలరు
క్షత్రియులు వైశ్యులును లేరు ♦ కలియుగమ్ము
నందు నంచు సిద్ధాంత వా ♦ క్యములువ్రాసి
పెట్టిపోయిరి స్మృతులు ద్రా ♦ విడులకొఱకు. 322

కం. మాయావాదము నిల్వదు
మాయావుల మంత్రతంత్ర ♦ మహిమంబిదిగో!
పాయఁగఁజొచ్చెను మాయో
పాయము లెన్నటికినైన ♦ బయలంబడవే ? 323

గీ. స్మృతులనుచు మఱియుఁ బురాణ ♦ వితతియనుచు
ముక్తినీఁజాలు గ్రంథ స ♦ మూహమనుచుఁ
గల్లకపటం బెఱుంగని ♦ నల్లవారు
నెమ్మనమ్ముల గట్టిగా ♦ నమ్మి చెడిరి. 324

చం. వినుము కుమార! నీకు విని ♦ పించెద సర్వము భావిసంగతుల్
కనుకనిచేత నింకఁ జిర ♦ కాలము ద్రావిడభూమి యీగతిన్

బనవదు పూర్వకాల పరి ♦ భావము నీఁగుసుమా ! ప్రబోధముం
గని యెనరేఁగి ద్రావిడులుఁ ♦ గాంచెదరర్హపదంబుఁ జెప్పితిన్. 325

ఉ. సేతువుఁదొట్టి వింధ్యగిరి ♦ సీమలదాఁక వసించు ద్రావిడ
వ్రాతము కన్నువిప్పి యొకఁ ♦ పారి కనుంగొని యాత్మదుస్థితిన్
దీతువుపిట్టవోలె నిగ ♦ దించెడి జాల్ముల తుర్రుళ్ళువాపి రుం
ద్రాతత పూర్వవైభవ స ♦ మన్వితులై యురళింతు రెంతయున్.

గీ. జాఁకఁ బడిబదారేండ్లుగ ♦ డాకమున్న
నూత్న భావోదయముగల్గి ♦ నూతన ప్ర
బోధమునుగల్గి ద్రావిడుల్ ♦ పూర్ణ గౌర
వంబుఁ బొందఁగలరు నిక్క ♦ వంబుగాఁగ. 327

—♦ అసురులవలస ♦—

వ. అని వచియించి, సూతమహర్షి నాచే నర్థింపఁబడి యవలి కథా
ప్రపంచమును వినిపింప సమారంభించి. 328

చం. అసురులు ప్రాణగొడ్డమగు ♦ నాకటి చిచ్చునకోర్వలేక నీ
రసపడి యెట్టకేని పర ♦ రాష్ట్ర పరంపరఁజూచి ప్రోచికో
నసువులఁ బశ్చిమాభిముఖు ♦ లై చని కాననసీమలందు దు
ర్వ్యసనములందుఁ జిక్కికి ప్ర ♦ వాసముఁజేసిరి సంతసంబుతో.

గీ. కాయకష్టంబులకునోర్చి ♦ గహనభూమి
శరభ సింహశార్దూలాది ♦ జంతువితతిఁ
జంపి వాసయోగ్యంబుగా ♦ నవదరించి
కాపురంబుండిరచట సౌ ♦ ఖ్యంబుతోడ. 330

గీ. కొంప గోడిగల గడించి ♦ కుములుడించి
పొట్టకూడు మఱియుఁ గట్టు ♦ బట్టగల్గి
పిల్ల జెల్లలతోడ వ ♦ర్ధిల్లినార
లసురసింహులందందుఁ గా ♦ అడవులందు. 331

గీ. అసురులిదె నేఁటి పారశీ ♦ కార్యులైరి
యసురసంతతి పారశీ ♦ లైరి నిజము
పారశీకమయ్యె నసుర ♦ వాసభూమి
తికమకలు లేక చర్చింపఁ ♦ దెలియఁగలదు. 332

చం. అసురవితానముంగలిసి ♦ యచ్చటఁ గాపురముండఁబోక యా
దెసలనువీడుచున్ యవలి ♦ దేశముఁబోయి సదా యయోనిజుల్
పసగల దేశముల్ గమిచి ♦ పట్టిసుఖోన్నతిఁబొంది నేఁటికిన్
వసతుల నేర్పఱించికొని ♦ వాసముఁజేతురు పేరుపెంపునై. 333

గీ. వారిపేర నచ్చటినాఁడు ♦ వన్నెకెక్కె
వారిపేర నచ్చటి వార్ధి ♦ వాసికెక్కె
నేఁటికినిగూడ వారి య ♦ నింద్యకీర్తి
యాదిశాభూమిఁ దాండవం ♦ బాడుచుండె. 334

గీ. ఆర్య వైభవంబునుగాంచి ♦ యసురవర్యు
లీసుతో వారిపైకి దం ♦ డెత్తివచ్చి
తుములసమరంబుఁ గావించి ♦ తుట్టతుదకు
నాశమంది రార్యావర్త ♦ దేశమందు. 335

## ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జన్మ వృత్తాంతము

వ. ఈ సందర్భమునఁ జిత్రమగు నొండుపాఖ్యానంబుఁ దెలిపెద నాకర్ణింపుము. ఎఱుంగుదువుకదా, వ్యాసభట్టారకుండు లిఖియించిన పంచమవేదంబన నెగడు మహాభారతమునందు, బంచపాండవుల యర్ధాంగియైన కృష్ణయుఁ దత్సేనానియగు ధృష్టద్యుమ్నుండును నయోనిసంభవులని వర్ణింపఁబడుట, లోకప్రతారణార్థంబు కల్పింపఁబడిన యేతద్విషయముంగూర్చి సాకల్యంబుగా సత్యంబుఁ దేటపఱతు. 336

ఉ. ఆలమునందు శౌర్యమడి ♦ యాలముగా విహరించు వీరపాం
చాలకుమారసింహ గురు ♦ చాపసముజ్ఝిత శింజినీధ్వనుల్
జోలలు పాడుచుండఁగ సు ♦ షుప్తినిబొందుచు నుండు ధారణీ
పాలవతంసుఁడౌ ద్రుపద ♦ భానుఁడొకండు కలండు వెల్గుచున్.

వ. పిన్ననాఁడితండు క్షత్రియకులోచిత ధర్మంబగు విలువిద్యను నేర్వ మున్యాశ్రమంబులకుంజని యందు విలువిద్యఁ గఱచుచుండ, భారద్వాజుండగు ద్రోణుండును సహపాఠియై తనతో మెలంగుచుండఁ గొండొకనాఁడు ద్రోణునిం జేరంజీరి "నెచ్చెలీ! మా పాంచాలదేశంబునకు నభిషిక్తుండనై నేను రాజ్యంబుఁ జేయునప్పుడు నీవటకరుదెంచినచో నిన్ను మన్నించి నీ యభీప్సితంబుల నీడేర్తు"నని ముట్టఁబలికి విద్యాభ్యాసంబుఁ బరిసమాప్తిఁ గావించుకొని మగిడి పాంచాలదేశంబుఁజేరి రాజ్యంబుఁ జేయుచుండ, ద్రోణాచార్యుండు కుటుంబభారంబుచేఁ గ్రుంగఁబడి, ద్రుపదుని వీడుచొచ్చి తన్నెఱింగించికొని, తత్సన్నిధానంబున నిలువంబడి, చిన్ననాఁటిమాటలు జ్ఞప్తికిఁదెచ్చి తా వచ్చినపని వినిపించిన ద్రుపదుండు. 338

గీ. ఓరకంటను బొడఁగాంచి ♦ యూరకుండి
యాప్తులనుగూడి పాచిక ♦ లాడుచుండి
మాటలాడమి గెల్చిన ♦ మగిడి ద్రోణుఁ
డచ్చటనుబాసి వెడలి దు ♦ రాగ్రహమున. 339

ఉ. తిన్నఁగ హస్తినాపురము ♦ తెన్నునఁబోయి సుధాపగాసుతుం
గ్రన్ననఁ గాంచి వచ్చిన ప్ర ♦ కారము సర్వముఁ దెల్పి వానిచే
మన్ననలందుచుం గురుకు ♦ మారులకుం దగురీతి నొజ్జయై
యన్నము సుంతలేక ధను ♦ రాగమమెల్లను నేర్పి పిమ్మటన్.340

కం. గురుదక్షిణగాఁ బార్షత
నరపాలకుఁ గట్టితెచ్చి ♦ నాకొసఁగుడి యో
ధరణీశతనయులారా!
యఱమఱలేకంచు ద్రోణుఁ ♦ డాడినయంతన్. 341

మ. ఉరు గర్జాపరిపూర్ణ దిక్తటుఁడునై ♦ యుద్వేగ సంరంభుఁడై
నరసింహాకృతి దివ్య ఘోర విలస ♦ న్నారాచతూణీరుఁడై
నరుఁడు గ్రోద్ధతిఁబార్షతుంబొడిచి వి ♦ న్నాణంబుతోఁదెచ్చిభూ
సుర పాదంబులమ్రోలఁబెట్టఁ బరితు ♦ ష్టుండై యతం డిట్లనెన్.

కం. వీ రెవ్వరు ద్రుపద ధరా
వరులా! యిట్లిల ♦ వచ్చి పడినారలు భూ
సుర పదములపై? తగునే
మఱి? యంచుడికించి పెక్కు ♦ మాటలచేతన్. 343

గీ. విడిచిపుచ్చినఁ బాంచాల ♦ విభుఁడు మాన
ధనుఁడు రాజలోకమునందుఁ ♦ దనకు సంభ
వించినట్టి పరాభవ ♦ మెంచి క్రోధ
తప్తచిత్తుఁడై పగ నీగ ♦ దారిలేక. 344

గీ. తండ్రిసూడు దీర్పఁ ♦ దగిన సూనుఁడు లేమిఁ
దనకుఁ గడిమి లేమిఁ ♦ దలఁచి తలఁచి
వనట మిగులఁజెంది ♦ పగఁబట్టియున్నట్టి
త్రాచుపాము వోలెఁ ♦ దల్లడిలుచు. 345

ఉ. బిడ్డలుసూడుఁ దీర్పఁగల ♦ వీరులు గల్గమిఁ దాల్మిలేక యే
యడ్డము వచ్చినప్పటికి ♦ నైనఁ గదించి నితాంతశక్తి నే
వెడ్డను నేనియుందగిన ♦ బిడ్డలఁబొందెడి నిశ్చయంబుతో
నెడ్డఁదలంచి మంచితఱి ♦ యెప్పుడువచ్చునోయంచు నుండఁగన్.

కం. ఉత్తర కురుభూములలో
నుత్తర దిగ్భాగమందు ♦ యోనిజతండం
బత్తరిఁ గాపురముండిన
వృత్తాంతంబెఱిఁగి చరుల ♦ వెంటనె పంపన్. 347

కం. యాజోపయాజులను ముని
రాజుల యుపదేశమంది ♦ రహిఁబార్షతపృ
థ్వీజాని యానఁ దలనిడి
జాజరతో వారు పనిని ♦ సాధింపంగన్. 348

కం. వేగులవాండ్రా వీటికి
వేగమ చని యందుఁగల్గు ♦ బిడ్డలనెల్లన్
బాగుగఁ గనిపెట్టుచు నా
భాగమ్మున వేచియుండ ♦ బహునైపుణితోన్. 349

కం. పొంగారెడి లావణ్యము
బంగారముఁ బోని మేని ♦ వన్నియ మిగులన్
రంగారెడి సౌష్ఠవమును
సింగారము గల్గియున్న ♦ శిశువులనెల్లన్. 350

వ. కాంచి, హర్షించి, యేలిక మనోరథంబీడేర్పఁజాలుదుమని
యెంచి, పొంచియుండ నొక్కరేయి. 351

కం. తెల్లని వెన్నెల గాయఁగఁ
జల్లని పయ్యెరలుదోలు ♦ సమయమునందున్
సల్లాపించుచు వచ్చిరి
పిల్లలు కవలారుబైట ♦ విహరింపంగన్. 352

సీ. మూఁడుబారలవిల్లు ♦ మూపుపై నానించి
పొదినిండ బాణముల్ ♦ పదిలపఱచి
కైజారుమొలథట్టి ♦ గట్టిగానిఱికించి
బారుటీఁటెను బ్రక్క ♦ జారవిడచి
గొనబుగాఁ దలమీఁదఁ ♦ గుళ్ళాయి సవరించి
మైయెల్ల గోపించు ♦ మఱువుఁదొడిగి
చికిలిచేసినకత్తి ♦ చేతిలో ధరియించి
బొబ్బరించెడి గవ్వ ♦ జబ్బఁదాల్చి

గీ. గున్న యేనుఁగు మఱపించు ♦ గునుకునడల
మొలక లెత్తెడి చిఱునవ్వు ♦ మోముఁగప్పఁ
బదపదారేండ్లు గడచన్న ♦ బాలకుండు
శౌర్య సౌందర్యరాశి య ♦ చ్చటకువచ్చె. 353

గీ. మసక మైచాయ దెసలెల్ల ♦ మసరుచుండఁ
గసటులేని లావణ్యంబు ♦ గంతులిడఁగ
ముద్దు మూటలుగట్టెడి ♦ ముద్దరాలు
బాలయాక్కర్త్తు నీటుతో ♦ బయలుదేర. 354

కం. ఇదె యదనని తలపోసి ద్రు
పద భూపతి చారపాళి ♦ పఱిఁగొనవారిన్
గదిసి పయింబడి పట్టుక
వదపదమని పైనమయ్యెఁ ♦ బార్ష్ణతుకడకున్. 355

కం. వచ్చిన చారులు మ్రుచ్చిమిఁ
దెచ్చిన బిడ్డలను గలక ♦ దేరిన మదితోఁ
జెచ్చెరఁ గనుఁగొని, వసదన
మిచ్చి యవలకంపి వారి ♦ నెల్లరఁ బిదపన్. 356

గీ. పట్టరానట్టి సంతోష ♦ భావమునను
ముద్దు పసిబిడ్డ లిద్దరి ♦ మోముఁగాంచి
యేమిచేయంగఁ జేయాడ ♦ కేకతంబ
మిగుల యోజించి, యోజించి ♦ మెలపుతోడ. 357

ఉ. శిష్టులఁగూడి మంతనముఁ ♦ జేసి, పరాకిసుమంత లేక సం
తుష్టినిబొంది యంత తమ ♦ తోయమువారికిఁజెప్పి పుత్రకా
మేష్టినొనర్చి బిడ్డలను ♦ నెట్టులొ కాంచెదనంచుఁ గార్గ్య సం
సృష్టమనంబునన్ బలికి ♦ చెచ్చెరదీక్షితుఁడై పునీతుఁడై. 358

ఉ. హోతలు ఋక్కులం జదువు ♦ చుండఁగ మిక్కిలి శ్రద్ధతోడను
ద్గాతలు సామవేదమును ♦ గానముసేయ మనోహరంబుగా
బ్రాతిగ యాజ్ఞికుల్ సకల ♦ వస్తువులన్ సమకూర్చుచుండఁ బ్ర
ఖ్యాతిగ యజ్ఞగుండ సము ♦ ఖంబున భూమిపుఁడుండి దేవితో.

గీ. సమిధలనువేసి యజ్ఞగుం ♦ డమున మివుల
నాజ్యమునుబోసి యగ్ని చ ♦ ల్లారకుండ
వ్రేల్చుచుండెను ద్రుపద పృ ♦ థ్వీవరుండు
భార్యతోఁబాటు పరవశ ♦ త్వమునఁజేసి. 360

గీ. యజ్ఞధూమంబు దిశలెల్ల ♦ నావరింప
యజ్ఞగుండంబు మంటతో ♦ నావళింపఁ
జెవులు చిల్లులుపడుచుండఁ ♦ జెప్పఁదొడగి
రఖిలమంత్రంబు లొప్పగా ♦ నచటిమునులు. 361

కం. ముగిసీ ముగియకమునుపే
బగబగ సవనాగ్ని యన్ని ♦ వైపులఁ బర్వెన్
సెగచే మొగములు మొగిడెన్
బొగచేఁ బ్రజ కన్నుదోయి ♦ మూతలువడియెన్. 362

కన్నుఁగవవిప్పి కనుఁగొన్న ♦ క్షణమునందె
మెఱుఁగుటొడలితో జన్నంపు ♦ టరుఁగుకడను
బాలుఁడొక్కండు మిఱిపెంపు ♦ బాలయోర్ధ్వ
నిలిచియుండిరి మిఱుమిట్లు ♦ గొలుపునట్లు. 363

ద్రుపదరాజన్య వంశంబు ♦ దొట్టుటకును
నగ్నిగుండంబులో నిప్పు ♦ డవతరింపఁ
జేసె నీయమళంబును ♦ సృష్టికర్త
యనుచుఁ దడబాటులేకుండ ♦ ననిరి మునులు. 364

ద్రుపదధరాధినేతసరి ♦ తోషవశంవదుఁడై వినీతుఁడై
విపులతపోధనుల్ మిగులఁ ♦ బ్రేమను దీవనలిచ్చి పంపఁగా
నపుడె శిశుద్వయంబును బ్రి♦యంబునఁ దోడ్కొని ప్రోలుచొచ్చి మో
దాపరవశత్వభావమున ♦ నన్నియు నేమఱిపోయె నక్కటా. 365

యజ్ఞవేదికామధ్యమం ♦ దవతరించి
నందున నయోనిజులు కని ♦ గందులనుచుఁ
జాఱెఁ బాంచాలమెల్లను ♦ మాటుఁబెట్టి
వారి యన్వయంబుఁ దెలియఁ ♦ బఱచకుండ. 366

కృష్ణయనుపేర బాల వ ♦ ర్ధిష్ణయగుచుఁ
బాండవేయుల యుమ్మడి ♦ భార్యయయ్యెఁ
బాండవ పృతనాధీశుఁడై ♦ బాలకుండు
వినుతికెక్కె ధృష్టద్యుమ్నుఁ ♦ డనెడిపేర. 367

వ. పుట్టుపూర్వంబు లజ్ఞాతంబులగుటంజేసి, కాలవశంబున నయో
నిజుఁడనెడి పేరు విలుప్తంబగుడు, ధృష్టద్యుమ్నుఁడు పాంచా
లుండయ్యెఁ గృష్ణయుఁ బాంచాలియయ్యె. ఇదియ సురాసురా
యోనిజుల పూర్వవృత్తంబు. విస్తరించి యెఱింగించితికదా! ముని
మాపగుచున్నది, బిడ్డా! యీ గోష్ఠిఁజాలించి కాల్యంబులఁ దీర్చి
కొని, గంగమడువునకుఁ బోదము" అని వాకృవ్వ వెంటనే నేను
గట్టాయితంబుకాఁగా బయలుదేరి పోయితిమి. 368

కం. ఈకథ వ్రాసిన విన్నను
వాకొన్నను బాడినంత ♦ పరువమునుబ్బున్
తేకువ జోకయుఁ బ్రబ్బున్
బ్రాకటముగ లిబ్బులుబ్బుఁ ♦ బైరములబ్బున్. 369